శ్రీ

## ఆంధ్ర తమిళ కన్నడ

# త్రిభాషానిఘంటువు



సంపాదకులు

వేదము వేంకటరాయశాస్త్రి
డాక్టర్ సి. ఆర్. శర్మ
తిరుమల రామచంద్ర




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవనము, సైఫాబాద్, హైదరాబాద్ - 4

# తొలిపలుకు

ఈకాలమున సంస్కృతాంధ్ర భాషల పాండిత్యాదులతోబాటు చారిత్రక ద్రావిడ భాషా పరిశోధనలకు చాల ప్రాముఖ్యము కలిగినది. పండితులకేగాక విద్యార్థులకును సామాన్య విద్యావంతులకును తమిళ కన్నడ భాషలను నేర్చుకొన గోరిక కలిగినది. అందువలన తెలుగు వారికి ఆంధ్ర ద్రావిడ కర్ణాటక పదకోశ మొకటి చాల అభిలషణీయమనియు, అది పరిశోధకులకేగాక సామాన్య జిజ్ఞాసువులకును చాల అవసరమనియు అకాడమీ అభిప్రాయపడినది. దానికి అనుగుణముగా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారి 1969వ, సంవత్సర పరిశోధన సంఘ సమావేశమున, సభ్యులు శ్రీ తిరుమల రామచంద్రగారు - పెద్ద త్రైభాషిక నిఘంటువు చాల కాలము పట్టును - గాన ఒకపాటి పరిమితిలో, సాహితీపరులకును సామాన్య విద్యావంతులకును పనికివచ్చునట్లు, తెలుగుపదము దానికి సరియైన తమిళ కన్నడ పదము లుండునట్లును, ఇందులకు ఆసంఘమందే సభ్యులుగా నుండిన వేదము వేంకటరాయశాస్త్రిగారు, పై మూడుభాషలు ఎరిగిన వారు సంపాదక సమావేశ కర్తగాను, శ్రీ తిరుమల రామచంద్రగారు ఆంధ్ర కన్నడముల నెఱిగినవారును, కేంద్ర సాహిత్య అకాడెమీ దక్షిణప్రాంతీయ కార్యదర్శి డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మగారు, ఆంధ్ర తమిళముల నెఱిగినవారు - ఇరువురును సంపాదకులుగాను కలసి, పై ముగ్గురు ఒక సంపాదక వర్గముగా నిఘంటువు నిర్మింపవలెనని ప్రతిపాదించిరి. అకాడమీ అంగీకరించి అట్లే యేర్పాటుచేసినది. ఈ ముగ్గురు పండితులు మొదట మదరాసులోనే యుండినను దేశకాలాదుల మార్పులవలన రచన కొంతకాలముపట్టినది. పిమ్మట ముద్రణము, ఈ ముగ్గురిలో సమావేశకర్తగారైన వేంకటరాయశాస్త్రిగారే ముద్రణాలయాధికారి యైనందున, వారే స్వయముగా చూచిన మంచిదని, వారికే ఒప్పచెప్పనైనది. జాగ్రతగా నిర్వహింపవలసిన పని యైనందునను, కాలవ్యత్యాసములవలనను ముద్రణముకూడ చాల నెమ్మదిగా నడచినది. గ్రంథము 600 పుటలకు మించి, క్రౌను సైజులో, మూడుకాలములుగా పుటలో మూడు భాషలు వచ్చునట్లు ముద్రితమైనది. ఈ మూడు భాషలు చదువగోరువారికి ఇది చాల ఉపయోగపడ గలదని విశ్వసించుచున్నాము. ఈ కార్యమును నిర్వహించిన పై సంపాదకులకు ముగ్గురకు మా ధన్యవాదములు.

హైదరాబాదు
10 - 1 - 1979

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# ఆంధ్ర తమిళ కన్నడ
# త్రిభాషా నిఘంటువు

## ఉపోద్ఘాతము

ఆంధ్ర తమిళ కన్నడ భాషలకొక సామాన్య పదకోశ ముండుట ఎంతయు అభిలషణీయమని మిత్రులు శ్రీ తిరుమల రామచంద్రగారు 1969వ సంవత్సరమున ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ పరిశోధన సంఘ సమావేశమున ఒక ప్రతిపాదనము చేయగా, దానిని అకాడెమీ అధ్యక్షులు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారును, కార్యదర్శులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారును అంగీకరించి, నేనును, శ్రీ తిరుమల రామచంద్రగారును, కేంద్ర సాహిత్య అకాడెమీ దక్షిణ ప్రాంతీయ కార్యదర్శి డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మగారును సభ్యులుగా నొక సంపాదక వర్గమును, ఆ సంపాదక వర్గమునకు నన్ను సమావేశకర్తగను, నియమించిరి. ఇది పెద్దపని గాన మేము మువ్వురము మదరాసులోనే అప్పుడుండినందువలన అదిమొదలు పలుమార్లు కలసికొనుచు చర్చించి తుదకు ఒక ప్రణాళికను నిర్మించుకొంటిమి.

ఈ నిఘంటువు ప్రధానముగా తెలుగువారి కొఱకు ఉద్దేశింపబడినది. మనవారు తమిళ కన్నడ భాషలను క్రొత్తగా నేర్చుకొనగోరినను, ఆయా భాషలలో ఒకపాటి సాహితీపరులకును రచయితలకును ఉపయోగపడునట్లును, అట్లే సామాన్య విద్యావంతులకు తగినట్లును - ఎక్కువ పాండిత్యాపేక్షకులకుగాక - దాదాపు 700 లేక 800 పుటలు, క్రౌను ప్రమాణములో, ముద్రణములో వచ్చునట్లు నిర్మింప దలంచితిమి. అదియే శ్రీ గోపాలరెడ్డి మహాశయుల యభిప్రాయమును శ్రీ అకాడమీ ఆశయమును. పరిశోధకజిజ్ఞాసు పండిత ప్రకాండులకు తగినట్లు నిర్మించుటకు ప్రయత్నించిన, అందులకు మేము మువ్వురము చాలముగదా శ్రీ సూర్యారాయమువలె అది కొన్ని సంపుటములు పెరిగి కొన్ని సంవత్సరములు పట్టుటయేగాక ప్రస్తుత పరిస్థితులలో అసాధ్యమును అగును.

కాబట్టి ఒకపాటి పరిమిత దృష్టితో, ఆచరణయోగ్యముగా నిర్మింపదలచి, మేము అకాడమీవారి యాదేశానుసారము ప్రారంభింపగా ఇంతలో మాలో నొకరైన శ్రీ తిరుమల రామచంద్రగారు, ఆంధ్రపత్రిక సంపాదక వర్గమున నుండినవారు, విరామముపొంది,

హైదరాబాదులో కార్యాంతరాసక్తు లగుటవలన మాకు కలసి పనిచేయుటకు సాధ్యముగాక తపాలుమూలముగా రచనలను అభిప్రాయములను అందించుకొనవలసివచ్చుటచే చాల కాలయాపనమైనది. అంతట శీఘ్రకరణమునకు ప్రారంభించి నేను బెంగుళూరు మైసూరు ప్రాంతములకు బోయి, అచ్చటి పండితులను విద్యావంతులను కొందఱిని కలసికొని, కన్నడ భాషలో నేటివఱకు ప్రకటితములై సులభముగా దొరకుచున్న పెద్ద చిన్న నిఘంటువులను పెక్కింటిని, మదరాసులోనే దొరకునట్టి పెక్కు తమిళ నిఘంటువులను కొని మన తెలుగు నిఘంటువులనుచూచి, అవశ్యకాంధ్రశబ్దసేకరణమును, వానికి అర్థనిర్ణయమును చేసి, వానికి సరియైన ద్రావిడ కన్నడ పదములను అచ్చటచ్చట హెచ్చరించి, ఆంధ్ర కర్నాటక భాషలలో పండితులైన శ్రీ తిరుమల రామచంద్రగారు కన్నడ భాగమును, అట్లే ఆంధ్ర తమిళములలో పారంగతులైన డా. చల్లా శర్మగారు తమిళ భాగమును నిర్వహించునట్లును, నేను ఈ మూడు భాషలయందును ఒకపాటి ప్రవేశముగల వాడను గాన సకల శబ్దార్థ సమన్వయాదికమును చేయునట్లును నిర్ణయించుకొని ఒకవిధముగా కాలయాపనమైనను పూర్తిచేసితిమి. ఇది సమగ్రము కాకపోయినను చాలవఱకు ఉపయోగపడునని విశ్వసించుచున్నాము.

ఇది సమగ్రముకా దను సమర్పకము ఎందులకు చెప్పుకొనవలసియున్న దనగా - నేడు, భాషాప్రయుక్త రాష్ట్రములలో తమతమ ప్రాంతీయ భాషలకు రాజకీయ ప్రాముఖ్యమును సమకూర్చుటకొఱకు, అమితోత్సాహోద్రేకములతో జరుగు ప్రయత్నములలో ఆంగ్లభాషయందలి భౌతిక రసాయనికాది శాస్త్రీయ పదములకేగాక రాజకీయ పదములకును ఆర్థిక పదములకును, చిత్రవిచిత్రములైన, ఉచ్చారణాసాధ్య జిహ్వాబంధక శబ్దములును, దీర్ఘ సమాస భూయిష్ఠములునుగా కూడ వారువారు అనువదించి ప్రకటించిన నూతన కృతక పదజాలము హిమవత్పర్వతమంత యున్నది. దీని నంతయు గ్రహించినయెడల ఈ నిఘంటువు బృహత్సంహితయగును. అంత బృహత్తును భరించుట సాధ్యముకాదు గావునను, ఈ నూతన పదములను ఆచరణకు తెచ్చుటకు ఇప్పుడిప్పుడే ఆయా ప్రాంతీయులు ప్రయత్నించుచు పెక్కువిమర్శలకు లోనగుచుండుటచేతను, మా కార్యమును అట్టివానికి పర్యాప్తము కానీయక పరిమితముగా నిలుపుకొంటిమి. సంస్కృతభాషా సంపర్కము చేత కన్నడభాషలో ఒకవిధముగా కొంత సులువుగా మన కర్థమగు పదములు కుదిరినను తమిళములో క్రొత్తగా కల్పింపబడిన పదములు తమిళులకే చాలమందికి ఇంకను అభ్యస్తము కావలసియున్నది. కాబట్టి చాలవఱకు అత్యంతాధునిక పదజాలసమగ్రములై యున్న శబార్థచంద్రికాది నిఘంటువులను ప్రధానీకరించుకొని ఈమూడు భాషలలోను పాదుకొనిపోయిన సంస్కృతాంధ్ర ద్రవిడ కర్నాట శబ్దములను గ్రహించి ఆంధ్రులకు తెలుగు పదముల నుపయోగించునపుడు సరియైన తమిళ కన్నడ పదములను తటాలున నిస్సంశయముగా ప్రయోగించుట కనువైన యట్లు కూర్చితిమి.

అనాదిగా సంఘ వాఙ్మయకాలము నుండియు, తమిళములో సంస్కృతపదములు వందలకొలది కనబడుచున్నవి. ఇవి సంస్కృతమునుండి తమిళమున కెక్కక తమిళమునుండియే సంస్కృతములో ప్రవేశించినవని మన తమిళ సోదరులు ఇప్పుడు పరిశోధక గ్రంథములు వ్రాయుచున్నను, సిద్ధాంతము లెట్లున్నను, ఉభయసామాన్య పదజాలము సమృద్ధిగా నుండుటచేత, తత్సమ తద్భవ పదములకు ఆయాభాషలలోని తుల్యపదములనేయిచ్చి వానితోకూడ తమిళ కన్నడ దేశ్య పదముల నిచ్చితిమి. మఱియొక కారణము మన మామూలు దైనందిన సంభాషణలలో మన యన్ని భాషలలోను సంస్కృత పదములు చాలవఱకును కలసిపోయి సుబోధములుగా నుండుట నిర్వివాదము. ఇంకొక విషయము - చక్కగా పరిశీలించిన తెలుగువారికన్న తమిళులే ఎక్కువ సంస్కృత పదములను ప్రయోగించుచున్నట్లు తోచుచున్నది. ( ఆంధ్రుడు 'అయ్యా బాగున్నారా'

యన్నచో తమిళుడు 'సౌఖ్యమా సార్' అనుట మనకు నిత్యానుభవము.) తటాలున సద్యఃస్ఫురణకు సంస్కృత పద ముపయోగపడుచుండగా భాషాజ్ఞానముకొఱకు తమిళ పదము పనికివచ్చుచున్నది. మఱియొక అనుకూల మేమనగా పెక్కు తమిళపదములు అచ్చ తెనుగుపదములుగా కనబడుచున్నవి. కొన్ని ద్రావిడ పదములు భిన్నార్థములలో కూడ ప్రయుక్తము లగుచు ద్రావిడభాషా సిద్ధాంత పరిశోధనకు స్ఫోరకముగా నున్నవి. ఇట్టివానినికూడ హెచ్చరించితిమి. ఇంతవఱకు శబ్దసేకరణను గూర్చి యైనది.

ఇక ఉచ్చారణ - ఆంధ్రులకు కన్నడములో ఉచ్చారణ ఎక్కువ కష్టముగాదు. శబ్దము చివర ప్రత్యయములు రాక బోడిగా నిలుచుట వారి భాషా స్వభావము. లిపి ఇంకను సులభము. ఇంచుమించు ఒకటే. తమిళములో రెండును కష్ట సాధ్యములు. ఉచ్చారణ యొక విచిత్ర వైఖరి. లిపి అంతకన్న విచిత్రము. పరుపాక్షరములు లేనందున క వర్గాదులలో క ఖ గ ఘ లకు బదులు కకారము మాత్రమే కలదు. ఇట్లే 'చ ట త ప'లే అన్ని మిగిలిన వర్గములకును. వీనిని సందర్భానుసారముగా నుచ్చరింపవలెను. అకం (அகம் = ఇల్లు) అని వ్రాసి అహం అని చదువుదురు, ద్విత్వము వచ్చినచోటులలో పక్కం (பக்கம்) = ప్రక్క, ను యథాలిఖితముగా నుచ్చరింతురు. పఙ్కు పంకు (பங்கு = భాగము)ను పంగు అని ఉచ్చరింతురు, ఇట్టి పదములను ఆంధ్రుల తమిళోచ్చారణ కనుకూలముగా ఉచ్చారణ ననుసరించియే వ్రాసితిమి, సంస్కృతమురాని తమిళులు, 'ప్రకారము' 'ఆరోగ్యము' వంటి పదములను తమ లిపులలో వ్రాసికొని 'ప్రహారం' 'అరక్కియం' అని యనుట క్రొత్తగాదు. ఆరోగ్యస్వాము లెందఱో 'అరక్కియసాము'లై యున్నారు, ప కారమును 'ప'గను 'బ'గను కూడ ఉచ్చరింతురు. పాంపు (பாம்பு) పాంబు (పాము) అగును. వ[illegible] బండి) వండిగాను, ఇటం (=చోటు) ఇడం గాను, కట్టి, కట్టిగాను, కడ్డిగాను, గట్టిగాను, గడ్డిగాను అగుటకు అవకాశములు గలవు. ఉప్పు మాత్రము ఉప్పే. కాని సమయానుసారము ఉబ్బు కావచ్చును. 'శ ష స'ల బాధ వర్ణనాతీతము. 'శంకర శశి శకల చూడ' యనుటకు 'సంకర ససి సకల సూడ' అనియో, 'జంగర జజి జగల జూడ' అనియో పలుకుట జగత్ప్రసిద్ధము. ఒక్క 'చ' కారమునే 'శ' 'జ' 'స'లుగా పలుకుటయు తెలిసినదే. 'పాచి - పాశి, కంజి - కంచి, కంచీవరం - కంజీవరం, చొల్లు, సొల్లు, శొల్లు.' ఇదంతయు నిట్లుండగా ఇది చాలదని అన్నిటిని మించి ழ అని యొక వింతయక్షరము తమిళములో కలదు. దాని స్థానమున నేటి కన్నడములోను తెలుగులోను ళకార డకారములు గలవు. అరటిపండుకు 'வாழைப்பழம்' తమిళులే చాలమంది నోరు తిరుగక 'వాళప్పళం' అనువారు గలరు. దీని యుచ్చారణ విని గ్రహింపవలసినదేగాని తెలుగులో వ్రాయుటకు తగిన యక్షరము లేదు. జ కొంత సమీపమే గాని సరికాదు. వాజప్పజం అన్న బాగుండదు. 'ద్రావిడ కజగం' అని మనవారు పలికిన వికారముగా నున్నదిగదా. ఇంగ్లీషు Zh మరికొంత సమీపము. VAZAPPAZAM. కాని ఇదికూడ వికారమే. ழ అను నక్షరమే దానికిసరి. వైష్ణవ గ్రంథములలో నీ యక్షరము మనవారికి పరిచితమే (తిరువాయ్మొழி). అట్టి పదముల సందర్భోచితముగా ழ కు ళ ను వాడితిమి. 'అకారము' 'చకారము' అని యనవలసినచోట్ల వీరు 'అగరం, చగరం' అందురు. ఉదా: తిరుక్కురళు మొదటిపంక్తి 'అగరముదల ఎழுత్తెల్లాం' (అక్షరముల కన్నిటికిని అకారము మొదటిది). ఇవన్నియు నెమ్మదిగా గ్రహింపదగినవి. తమిళులకు ఒత్తులు లేవు సరిగదా ద్విత్వాక్షరములను, సంయుక్తాక్షరములను గాని వ్రాయవలసినయెడల అర్ధాక్షరములను ముందుగా వ్రాసి అట్లే పఠింతురు. అక్క (அக்கா) అణ్ణ (அண்ணா) ఇత్యాదులను అక్‌క, అణ్‌ణ అని వ్రాయుట వారి పద్ధతి. ఉచ్చారణయు వ్రాతయు ఒకవరుసలో నున్నవి. మనము 'అన్న' అని వ్రాసినప్పుడు తర్వాత వ్రాసిన ఒత్తును

ముందు పలుకుచున్నాము. అద్దమును అద్దము అనిగదా న్యాయముగా వ్రాయవలెను. అదద్ము అని, వ్రాసినట్లే ఉచ్చరించిన నెంత వికారము. తమిళులుకానివారందఱును ఇట్లే వ్రాయుటయు, తమిళులు వేఱుతీరున వ్రాయుటయు లిపిపరిణామములో పరిశోధనీయాంశములు.

తెలుగులో మొన్నమొన్నటివఱకు నుండిన వలపలి గిలక (ౙ) రేఫస్థానీయము, ఇతరు లింకను వాడుచుండి నను నేడు కనబడదు. ఉదా: దర్పమును దవర్పము అని వ్రాయుచుండిరి. హిందీ కన్నడాది భాషలలో నున్నది. నేటి మన విద్యార్థులు దపర్మ అని చదివి అర్థముకాక ఆశ్చర్యపడుదురు. ఇది కన్నడము చదువగోరువారు గ్రహింపవలెను. కాని యీనిఘంటువున దానిని వాడలేదు.

## ఈ నిఘంటువుయొక్క ప్రయోజనము

ప్రతి నిఘంటువును గుఱించియు ఇదియొకసమస్య. బొత్తిగా (తెనుగుగాక) ఇతరభాషలు రానివారికి ఇది కొంతవఱకు చిక్కే. తమిళమునందుగాని తెనుగునందు గాని ఒకపాటి ప్రవేశముగలవారు దీని ప్రయోజనమును గుర్తింపగలరు. అక్షరజ్ఞానము, ఆ యా భాషలస్వరూపము, ఉచ్చారణాదులు కొంత తెలిసియుండవలెను. చిన్నతరగ తుల పాఠ్యగ్రంథాదులను చదివి కొంత వాక్యరచన అల వఱుచుకొనియుండిన మఱియు మంచిది. అట్టివారు తెలుగు కోణమునుండి చూచునప్పుడు ముందుగా మనసున తెనుగు శబ్దమే తోచునుగాన, దానికి కన్నడ తమిళశబ్దములను చూచుకొనుటకు ఇది అనుకూలము. పైగా ఒక్క తెనుగు పదమునకు లెక్కలేని అర్థములు తెలుగులోను ఇతర భాషలయందును కూడ నుండునప్పుడు వరుసప్రకారము తెలుగర్థములను తమిళ కన్నడ పదములను ఇచ్చితిమి. ఒకయర్థమందే పెక్కుపదము లుండినప్పుడు ప్రయోక్త తన భాషాజ్ఞానము ననుసరించి సమయోచితముగా ప్రవ ర్తించుట కనుకూలముగా పదములను అర్థములను ప్రద ర్శించితిమి. కాని బొత్తిగా ఈ యితరభాషలు రానివారు కూడ వినోదముగా ఈ నిఘంటువును చదువుచు పోయిన యెడల కూడ కొంత భాషాజ్ఞానము కలుగకమానదు. ఇట్లు పదములను గ్రహించినవారు వాక్య వ్యాసరచనాభ్యాస గ్రంథములచేత భాషాజ్ఞానము సంపాదించుకొనుటకును ఇది అనుకూలమే. మఱియొక యనుకూల మేమనగా ఇవి మూడును ద్రావిడభాషలు గాన ద్రావిడపదజాలము బోధపడి మన తెలుగుపదములే ఇతర ద్రావిడులు ఎట్లు కొన్నిటిని సమానార్థకములుగాను కొన్నిటిని భిన్నార్థకములుగాను, భిన్నోచ్చారణతోను వాడుచున్నారో తెలియును. (ఉదా: చెవి, శెవి, కివి. ఎలుక, ఎలి, ఇలి; నెమిలి, నవిలు, మయిల్ - తోగై - ఇత్యాదులు) ఫైలాలజీ విద్యార్థులకిది చాల సహాయకారి. సంస్కృతపదములను గుర్తించు నపుడు మనమీద నెంత సంస్కృతప్రభావమున్నదో ఇత రులమీద నెంతయున్నదో, ఇప్పుడు ఇతరుల భాషావాద ములు ఎంతవఱకు సమంజసములో సుబోధమగును. దేశ మందు కోట్లకొలదిజనులు, తమకు తెలియకయే, అప్ర యత్నముగా, పరంపరాగతములైన పదములనే వాడు చుందురు. అవి చాలవఱకు సంస్కృతములుగానే యుండును. తమిళమునుండి తొలగింపరాని సంస్కృత పదములను గుఱించి తమిళసోదరులు ఇప్పుడు నూతన సిద్ధాంతములను ప్రతిపాదించుచున్నారు — ఏమనగా, ఇవి తమిళపదములే సంస్కృతమున కెక్కినవి — సంస్కృ తము, అనగా లౌకిక సంస్కృతభాష ఇతర భాషలనుండి చాలపదములను గ్రహించినది, ఈ తమిళ సంస్కృత సామాన్యపదములు అసలు తమిళపదములేగాన అవి తమకు గ్రాహ్యములేయని. మంచిదే, మనకు సంతోషమే. ఈ పదములను వీరు తొలగింపరని తెలియుచున్నది. సమా ధానము ఏదైనను ఫలితార్థము ప్రధానము.

## ద్రావిడభాషల స్వరూపము – చరిత్ర

తెలుగు తమిళ కన్నడ మలయాళములు ద్రావిడ భాషలు. వీనికి చక్కని వాఙ్మయములు కలవు. అట్లే వాఙ్మయముగాని లిపిగాని లేక సంభాషణరూపములోనే

మొన్నటివఱకునుండి ఇటీవల లిపినిగ్రహించి వాఙ్మయాభివృద్ధి గనుచున్న తులుభాషాదులును గలవు. వీనిని తొలుత గుర్తించి ద్రావిడభాషాసిద్ధాంతమును ప్రతిపాదించిన పండితుడు కాల్డ్వెల్ దొర. దానిని తర్వాత పెంపొందించి శబ్ద తత్త్వగ్రంథములను ప్రకటించినవారు, మా మాతామహులు శ్రీ 'తాతవెళ్లి మిరాదార్' శేషగిరిశాస్త్రిగారు, ఇటీవల నెందఱోపెద్దలు కృషిచేసియున్నారు. ద్రావిడపదము లన బడువానిని కొందఱు ప్రాకృతపదములని ప్రతిపాదించినను, ఆ ప్రాకృతముకూడ ఆర్యభాషాసిద్ధాంతాదులచేత సంస్కృతవర్గమునకు అనేక కారణములచేత ఇముడ నందున 'ఆర్యద్రావిడభాష' లనబడు రెండు పరస్పర సంబంధములేని వర్గములుండినట్లే గ్రహింపవలసియున్నది. తమిళభాషావాదులు నేడు చెప్పునట్టి సందేహగ్రస్తపదములను—సంస్కృతములా కావాయని వదలినను, సిద్ధాంతమునకు మాత్రము లోపములేదు.

రెవరెండ్ కాల్డ్వెల్ తన Dravidian Comparative Grammar లో ఇట్లు వ్రాసినాడు "The Tamil language is undoubtedly the oldest, richest and most highly organised of the Dravidian languages".

రెవరెండ్ డా. విన్స్లో అనునతడు ఇట్లు వ్రాసినాడు — "In the sixth or seventh century before Christ, at the head of a colony of holy ascetics, we find the celebrated Agastya called the Father of Tamil. He is said to have learned it from Skanda, the second son of Siva. We are not to suppose that he formed the Tamil alphabet. The words எழுத்து (ఎழுత్తు) and சுவடி (శువడి), book are original Tamil; and show that such existed before there were any innovations from Sanskrit, which Agastya himself commenced. He formed the first Tamil grammar. It contained 12,000 sutras. All is now lost except some fragments preserved by Tholkappiyan in a grammar which bears his own name. Agastya wrote voluminonsly both in Tamil and Sanskrit."

ఇతడే ఇంకను ఇట్లు వ్రాయుచున్నాడు.— "It is said that the language of the mountaineers of Raj Mahal abounds in terms identified with Tamil and Telugu. What is more singular, the names by which the ivory, apes, peacocks, conveyed by Solomon's ships of Tarshish were known, are the same with those still used in Tamil, seeming to imply that the traders visited Ceylon or India aud obtained with these novelties their Tamil names Danta, Kapi and Togai as found in the Hebrew Bible. (దంతము, కపి, తోగై = తోక గలది = పింఛము గలది = నెమలి)... The Tamil is not a vulgar dialect. Before the principal basis of the English had a written character it was a highly polished language. Its name signifies sweetness and it is not without its claim to euphonic charms and "linked sweetness". ... Unlike several of the vernaculars of India, it is not as some have supposed, a daughter of the Sanskrit. Its alphabet differs not only in character but in sound and is more limited. Its grammar, though conformed to the Sanskrit, as far as the genius of the language would allow is still very different. It has no article, no relative pronoun, no dual number, no operative mood. It differs in its numerals, in many nouns, verbs and adverbs and in technical terms in grammar. In the declension of its nouns, the conjugation of its verbs and the arrangement of its sentences, it more resembles the Latin."

అన్ని భారతీయ భాషలును సంస్కృతమునుండి గ్రహింపగా తమిళము గ్రహింపలేదుగదా, అందుండియే సంస్కృతమునకు 31 పదములు ఎక్కినవనియు, 21 పదములు ఈ రెండుభాషలును మఱి యెచ్చటినుండియో గ్రహించినవనియు, కాల్డ్వెల్లు వ్రాసినాడు. పైగా సంస్కృతమే తమిళమునకు అక్కరలేదట. "The Tamil, the

most cultivated *ab-intra* of all the Dravidians, can dispense with the Sanskrit altogather, if need be, and not only stand alone, but flourish without its aid." ఇందులకు కారణములను తమిళ భాషావాదులు భిన్నరీతుల ఊహించినారు.

సంస్కృతము బ్రాహ్మణులభాష, తమిళమును పెంపొందించినవారు బ్రాహ్మణేతరులును జైనులునునట. తిరుక్కురళ వ్రాసిన తిరువళ్లువరు పంచమవర్ణుల పురోహితుడుట. అవ్వైయ్యారు ఆతని సహోదరియట. చింతామణి, నన్నూల్ ఇత్యాదుల రచయితలు జైనులు. పదునొకండవ శతాబ్దమున రామాయణమును వ్రాసిన కంబ మహాకవి బ్రాహ్మణేతరుడు. పెరియపురాణమను శైవ భక్తుల (63) చరిత్రలను వ్రాసిన శేక్కి ళా (ழா) రు వెళ్లాళకులమువాడు. ఇట్లే పలువురు. తమిళలిపియు ఇతర భారతీయ లిపులతో సంబంధపడినదికాదట. మొహెంజోదరోలో దొరకిన చిత్రలిపి ద్రావిడులదట. తమిళమున 'వట్టెళుత్తు' అనబడు గుండ్రనిలిపి బ్రాహ్మీలిపి జన్యము కాదట. ழ (ళ్), ఱ, (శకటరేఫము) ఇత్యాదులు సంస్కృతములో లేవు. ఇట్లు ఎన్నియో చూపుదురు.

కాని వీనికి ఆక్షేపములు లేకపోలేమ. తమిళము చాల ప్రాచీనమే యనుట బైబిలులోని యుదాహరణముల వలన నిస్సందేహమే కాని, పై విషయములు పూర్తి యథార్థములు కావు. సంస్కృతము బ్రాహ్మణుల భాష కాదనుట ముమ్మందు వివరింపబడును. తమిళ రచయితలు బ్రాహ్మణకులమువారు కాకపోయినను బ్రాహ్మణ సంస్కృతికి, భారతీయ సామాన్య సంస్కృతికి, భిన్నులుకారు. తిరువళ్లువరు బ్రాహ్మణేతరుడు కావచ్చునుగాని పంచముడో లేక చాల అధమవర్ణుడో కాడని ఇటీవల పండితుల సిద్ధాంతము. ఆతని కురళనబడు నీతిశాస్త్రగ్రంథములో గృహనీతి, లోకనీతి, రాజనీతి, కామశాస్త్రము కాకపోయిన సాంసారికమార్గము అనబడునవి మూడు భాగములుగలవు. ఇవి భారత, ధర్మశాస్త్ర అర్థశాస్త్ర వాత్స్యాయనాద్యనేక శాస్త్రముల సారమేగాక, వీనిలో రాజ్యసప్తాంగసిద్ధాంతము చక్కగా ప్రతిపాదింపబడియున్నది; సంస్కృత భాషాపరిజ్ఞాన మపారముగా కనబడుచున్నది. ఈతని చిన్ని సూత్రప్రాయమైన గ్రంథమును గ్రహించి ఆ యా గ్రంథకారులు తమతమ గ్రంథములను పెంచి వ్రాసిరనుటకన్న ఆతడే సంస్కృత వాఙ్మయసార మనదగిన గ్రంథమును తమిళములో రచించెననుట యొప్పును. వళ్లువశబ్దము వల్లభశబ్దభవమనియు, ఇతడు రాజనియోగియో, సామంతప్రభువో, అమాత్యుడోయని మహాపండిత రాఘవయ్యంగా రనువారు వ్రాసినారు. అవ్వైయారు ఈతని సోదరికాదు, ఎవరో, అని తేలినది. జైనరచయితలు ఇతరత్ర ప్రాకృతము నభిమానించినవారు తమిళనాడులో తమిళమున వ్రాసినారు. వారి మతమును సంస్కారమును మగధదేశమందును పాటలీపుత్రమందును వర్ధిల్లి దక్షిణదేశమునకు వచ్చినట్టివే గాని ఇక్కడ పుట్టినట్టివికావు. మఱి, ఇతర రచయితల నాటికి సంస్కృతముయొక్కయు, సంస్కృత కావ్యముల యొక్కయు ప్రభావము దేశమందు చక్కగా వ్యాపించిన తర్వాతివిగాని ముందువిగావు. తమిళశైవసిద్ధాంతమందలి శాస్త్రీయపదజాలము సంస్కృతమయము. కాబట్టి వీరిని ప్రస్తావించుటవలన ప్రయోజనములేదు.

నేటి తమిళలిపి అశోకుని బ్రాహ్మీలిపినుండి క్రమపరిణామమందినదేగాని వేఱుగాదని ఇటీవలి సిద్ధాంతము. ழ ఱ లు భాషకు తగినట్లు మధ్యకాలమున నిర్మించుకొన్న నూతన చిహ్నములు. అట్లే ఎ ఏ ఐ ల, ఒ ఓ ఔ ల హ్రస్వరూపములును. మొహంజోదరో హరప్పల లిపి యొక్క అంతు తేలలేదుగదా. వీని వివరము ఈ యుపోద్ఘాతము చివర లిపి చరిత్రలో వివరింపబడియున్నది.

ఇట్లు చారిత్రకదృష్టితో చూచినయెడల తమిళమందు సంగంవాఙ్మయ మేర్పడునాటికే సంస్కృతపద జాలము కనబడుచున్నది. ఈ భాషాశాస్త్రసిద్ధాంతములు తరచి చూడను చూడను, గందరగోళముగానుండి తుదకు

ఘట్టకుటీప్రభాతన్యాయమున, విధిలేక, పాతసిద్ధాంతమునకే వచ్చుటయు జరుగుచున్నది. సంస్కృతము బ్రాహ్మణుల భాష, ద్రావిడము బ్రాహ్మణేతరులది అని యొకవైపు చెప్పుచునే, సంస్కృతములోనికి ద్రావిడపదములు వొచ్చినవని చెప్పుచు మరల ద్రావిడభాషయు వాఙ్మయమును సంస్కృతముచేత అభివృద్ధియైన వనుచున్నారు.

"The Tamil has cartainly been greatly enriched from the Sanskrit and has barrowed from it some letters, rather, however, as a convenience than necessity. There is no reason or rejecting this aid, within proper bounds. By it the language has become copious, as before. It was precise, philosophical and energetic ..." (Bhavanandam Pillai, Tamil Dictionary) Vocabulary అను శీర్షికక్రింద వీరే ఇట్లు వ్రాసినారు.

"We have to consider those phases of our language that call for speedy reform; and the first of these that demands our foremost attention is the vocabulary of our language. Though it is now difficult to decide what the character of the vocabulary of primitive Tamil was in those prehistoric times when the light of Sanskrit civilisation had not reached it, we have reasons to think that it indicated a life which, though not highly civilised, was surely far from being savage. Later on when the whole of Southern India was swept over by a wave of Sanskritic civilisation, which had begun to enliven every nook and corner of the land, the Tamil language very wisely and discreetly bent its head to the overwhelming force of the new influence and allowed itself to be strengthened and vivified and improved by it. But long after, when our country was invaded and occupied by tho Mussalmans from the North and the land was flooded by a flux of new words relating to the Judicical and revenue administration of the country which these conquerors had the privilege to overhaul and manage, we find that the portals of our literary language were firmly closed against these alien words and admittance was stoutly refused. The spoken language on the other hand ... began to admit them freely into its fold ... ... ... a difference which has today widened into a gulf of almost impassable breadth ... ... Again, when after many centuries ... we find the same state of affairs: the literary language is obstinately as ever refusing admission to foreign words and the spoken dialect is freely adapting itself to the new environment. The question now is: How are we to make up the differnce between the spoken and the written language? There are only two courses open; one is to make the language weave out of its own bowels new compounds that would convey the new ideas now claiming expression in our language and the other is to import unhesitatingly the ready-made words from other languages" అని వ్రాసి యీ విషయమును కూలంకషముగా చర్చించి తుదకు వ్యావహారికభాషా ప్రవాహములో తత్తద్భాషానుగుణ్యమైన ఉచ్చారణను పొంది (అనగా తత్సమమో తద్భవమో ఐ) మన భాషలలో కొంతకాలమునుండియు ఊతగొని నిలిచిపోయిన పదములను గ్రహింపవచ్చునని తేల్చినారు. ఎందులకనగా, నిత్యజీవితములో జనులు, కవులును పండితులును కారుగాన, క్రొత్త వస్తువులును వానితో క్రొత్త పదములును వచ్చినప్పుడు వానికి తమ భాషనుండి నూతన పదములను కల్పించుట ఎఱుగరు. అన్యదేశ్యములనే తమ కనుకూలముగా మార్చి గ్రహింతురు. శ్రీపిళ్లైగారు ఇంకను ఇట్లు వ్రాసినారు.

"Today about 200 Urdu words and half as many English words await admission into the Tamil language. A carefull analysis of few of these given below will show clearly that all of them are highly indispensable to us, and it is not possible to carry on any decent conversation or transact any daily business without them. Of words relating (1) to Law,

we have:—*cutchery*, *vakil*, *jamin*, *asal* etc., from Urdu sources; and *judge*, *magistrate*, *appeal*, etc., from English: (2) relating to Revenue:— *tahsil*, *munsif*, *sircar* etc., from Urdu; and *collector*, *clerk*, etc., from English; (3) relating to Arts and civilizasion:— *rail*, *ticket*, *station*, *motor* etc., from English."

ఇట్లువ్రాసి తమిళలిపికి సంస్కరణావశ్యకతకలదా, f అను నక్షరము fiddle, funnel మున్నగువానిని ఉచ్చరించునప్పుడు చేర్చుకొనవలదా యనుటను చర్చించి, ఆంగ్లేయులు మన అరిసిని (తమిళములో బియ్యము) rice అనియు, తంజావూరును టాంజోర్ అనియు, చోళమండలమును Coromandal అనియు మార్చినట్లే 'phonological methods' ననుసరించి మార్చిన పరవాలే దన్నారు. సంస్కృతపదములను గురించి.... even these words have had to pass through the process of phonological changes, we should, therefore, take the loan words as we find them used by the people, as they are modified in the current of our language wherein their pricking points are worn off, their angularities removed and their surface is polished."

కాని చివర ఖ గ ఘ ఇత్యాది, తమిళమునలేని యక్షరములను తెచ్చుకొనుట మంచిదన్నారు. తమిళక (க) కారమునకు అడుగున చుక్కలనుపెట్టి க க. க.. க... ఖ గ ఘ లుగా ప్రతిపాదించినారు. ఇప్పుడు చాలమంది సంస్కృత శ్లోకములను ఇట్లే వ్రాయుచున్నారు. ఇంతకన్న గ్రంథాక్షరములనుండి గ్రహించుటయే మంచిదికాదా. (గ్రం. అక్షరములకు ఈ పీఠిక చివర చూడుడు) F, f కు ఇప్పుడు తమిళులు ஃ అను తమ (అక్ - అహ్) నే వాడుచున్నారు. క వర్గమువలెనే మిగిలిన వర్గములకును ఈ పద్ధతి అనుసరింపబడుచున్నది.

ఇదంతయుచూడగా సంస్కృతము, అదెట్టిదైనను, తప్పనిసరియని తేలుచున్నది. తమిళమునకే సంస్కృతము పనికివచ్చినప్పుడు ఇతరులమాట అదెంత. మదరాసు విశ్వవిద్యాలయమువారి Tamil Composition Committee Report 1925 లో నిట్లుకలదు..—"Resolved that the borrowing of foreign words be allowed in Tamil ..... Note - In this resolution borrowing from Sanskrit is not looked upon as borrowing from a foreign source." కాని ప్రస్తుతము భాషాప్రయుక్త రాష్ట్రములు వర్ధిల్లుట కారంభించి ప్రాంతీయాభిమానము చిత్రవిచిత్రగతులను ప్రదర్శించుచుండుటచేత ఆయాప్రాంతీయులకే అర్థముకాక, దిగ్భ్రమగొలుపు పదజాలము ఉత్పత్తి యగుచున్నది. ఇందు రాజకీయముండుటచేత వానికి కొంత కాలము గడచినగాని నిఘంటువుల కెక్కు ప్రామాణికత రాదుగాన ఇట్టి పదములను ఇందు గ్రహింపలేదు.

ఇప్పుడు కొంత సంస్కృతాంధ్ర ద్రావిడ కర్ణాటక భాషలయు దేశములయు చరిత్రను దిక్ప్రదర్శనముగా చూచుట మంచిది. వాని పరస్పర సంబంధము తెలియును; శబ్దముల మూలరూపముల నన్వేషించువారికి పెద్దపెద్ద మూలాధార నిఘంటువులను చూడగోరువారికిని ఆసక్తి జనకముగా నుండును.

## మన భాషలు

నేడు భారతదేశమందు ప్రధానభాషలుగా మన మనుకొను సంస్కృత ద్రావిడములలో ప్రాచీనతమము తమిళముగానే కనబడుచున్నది. ఇచ్చట సంస్కృతమనగా లౌకికసంస్కృతమునే గ్రహింపవలెను. మలయాళము మొన్నటివఱకును తమిళములో అంతర్భాగము. తమిళమునకు తర్వాత, దాదాపు క్రీ. శ. ఐదవ, లేక, ఆఱవ శతాబ్దమున కన్నడమును, ఏడవ శతాబ్దమునుండి తెలుగును కనబడుచున్నవి. వీనిలో ఎనిమిదవ శతాబ్దమునుండి కన్నడమందు వాఙ్మయమును, పదునొకండవ శతాబ్దము నుండి తెనుగునందు వాఙ్మయమును కనబడుచున్నవిగదా, ఇందులో తెలుగు ఆంధ్రమేయైయుండినయెడల శాతవాహనుల కాలమునుండియు దీనికి వాఙ్మయముండి యుండ

వలదా? కానరాదుగదా! మఱి, ఏయితరభాషకును కాన రాని - ఆంధ్రము తెలుగు అను - రెండు పేర్లు మనభాష కెందుల కేర్పడెనో. ఇది పరిశోధింపదగినదిగదా. ప్రాచీ నాంధ్ర శాతవాహనులకు ప్రాచీన తమిళులు (సంఘం వాఙ్మయమునాటివారు) సమకాలికులు కాబట్టియు, నాటికి సంస్కృతము లౌకికవ్యవహారశాసనాదులభాషగా కనబడదు కాబట్టియు ఈ కాలమునుండియే ప్రారంభించుట మంచిది.

ప్రాచీనాంధ్ర శాతవాహనులు క్రీ. పూ. దాదాపు 240 నుండి, లేదా కొందఱి ననుసరించి 270 నుండి, దక్షిణా పథమును పరిపాలించినను వారు ప్రాకృతభాషనే ఆదరించిరి గాని సంస్కృతమును ఆదరింపలేదు. కథాసరిత్సాగరము లోని గుణాఢ్యుని కథను మాటవరుసకు నమ్మినను (నాకు నమ్మకము లేదు. చూ. నా వ్యాసము, 'కథాసరిత్సాగరము నకు మూలమేది? భారతి 1960 జూన్) గుణాఢ్య శర్వవర్మల ప్రతిజ్ఞలచేత సంస్కృతమందు పండితుడైన శాతవాహనమహీపతి బృహత్కథకు సంస్కృతాను వాదము వ్రాయింపక, లేదా, తానైనను వ్రాయక, ఆ పైశాచీ బృహత్కథనే, యథాతథముగా, పైశాచియందే లోక మందు ప్రచారము చేయించుట ఆశ్చర్యముగదా!

లౌకిక సంస్కృతవాఙ్మయ మెప్పుడు ప్రారంభ మాయెనో తెలియదు గాని, శాసనములలో మాత్రము సంస్కృతము క్రీ. శ. రెండవ శతాబ్దమునకు ముందుండిన నిదర్శనములు కానరావు. పాణినీయాది వ్యాకరణములును, కౌటిలీయార్థ శాస్త్రాదులును కొన్ని క్రీ. శ. మునకు ముందుండినవేమోగాని మిగిలిన వాఙ్మయమంతయు తర్వా తిదిగానే కనబడుచున్నది. మఱి లౌకికసంస్కృతము చాల ప్రాచీనమై యుండినయెడల అశోకుని కాలమునుండిగాని చంద్రగుప్తుని కాలమునుండిగాని ఎక్కడను మందుకొఱ కైను రెండు పంక్తులు సంస్కృతము శాసనములలో కనబడదా!

## సంస్కృతభాషయొక్క ప్రారంభకాలము

వైదిక వాఙ్మయమునకును లౌకిక సంస్కృతవాఙ్మ యమునకును నడుమ కొన్నివందల సంవత్సరములు, బౌద్ధ జైనమత ప్రచారములచేత ప్రాకృతభాషలు వర్ధిల్లినవి. సంస్కృతభాష యొకటియుండి దానిని మాని ప్రాంతీయ భాషలలో బౌద్ధులును జైనులును ప్రచారమొనర్చిన ట్లొక దురభిప్రాయము లోకములో ఏర్పడియున్నది. ప్రాకృతా దుల సంస్కరణమే సంస్కృతభాషకు పునాది. ప్రాకృతమే మార్పుచెంది సంస్కృతమైనదని మన యాలంకారికులు చెప్పుచున్నారు.

"సకల జగజ్జన్తూనాం వ్యాకరణాదిభి రనాహిత సంస్కారః సహజ వచనవ్యాపారః ప్రకృతిః; తత్ర భవం, సైవవా ప్రాకృతమ్. 'అరిసవ ఆణేసిద్ధం దేవా ణమ్ అద్ధమాగహో వాణీ' ఇత్యాది వచనాత్ ప్రాక్ పూర్వంకృతం ప్రాకృతం, బాలమహిళాది సుబోధం సకల భాషానిబన్ధనభూతం వచనముచ్యతే. మేఘనిర్ముక్తజలమివ ఏకస్వరూపమ్. తదేవచ దేశవిశేషాత్ సంస్కార కర ణాచ్చ సమాసాదిత విశేషం సత్ సంస్కృతా దుత్తర విభేదా నాప్నోతి. పాణిన్యాది వ్యాకరణోదిత శబ్దలక్షణేన సంస్కరణాత్ సంస్కృతముచ్యతే. తథాచ ప్రాకృతమేవ కిఞ్చి ద్విశేషలక్షణా న్మాగధికా భణ్యతే .... .... ప్రాకృత మేవ కిఞ్చిద్విశేషాత్ పైశాచికమ్ ... ... శూరసేన్యపి ప్రాకృతభాషైవ.... ....తథాహి ప్రాకృతమే వాపభ్రంశః స ఏవాన్యై రుపనాగ రాభీర గ్రామ్యత్వభేదేన త్రిధోక్తః. తన్నిరాసార్థ ముక్త భూరిభేద ఇతి. కుతః? దేశవిశేషాత్ కారణాత్. తస్య లక్షణం లోకాదేవ సమ్య గవసేయం."

"ఇట్లు ప్రాకృతమే మార్పుచెంది సంస్కృతమాయెనని పెద్దలు చెప్పియున్నారు." అని మా తాతగారు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు తాము వ్రాసిన 'ఆంధ్ర వ్యాక రణ సర్వస్వ తత్త్వము' లో పుట 20 లో వ్రాసి యున్నారు.

సంస్కృతమును ఏకొద్దిమంది పాణిన్యాదిపండితులో వాడుకొనుచుండి, వారికడనుండి అది ఆసేతుహిమాచలము దేశవ్యాప్తముగా ఆదరింపబడుటకు కొన్నిశతాబ్దములు పట్టియుండవలెను. మనపురాణములలోని విషయములు చాల పురాతనములేయైనను అవి లౌకికసంస్కృతభాషలో క్రీ.శ. మూడవశతాబ్ది ప్రారంభముననో కొంత తర్వాతనో వ్రాయబడియుండవలెనని చరిత్రకారమతము.

మఱియొకరహస్యము బయలుపడుచున్నది. దేశమందు ప్రాకృతాదులు సర్వవ్యాప్తములుగా నుండిన కాలముననేగదా తమిళముకూడ వర్ధిల్లినది. తమిళమును ప్రాకృతాదులలో వ్యాకర్తలుగాని ఆలంకారికులుగాని చెప్పలేదు. భరతనాట్య శాస్త్రమందలి భాషానిబంధనములో పాత్రలకు ప్రాకృతాది పాత్రోచిత ప్రాంతీయభాషాప్రయోగాది సందర్భములలో ద్రావిడభాషను చెప్పియున్నాడు. తమిళములో కూడ ప్రాకృతాదులవలె ద్వివచనములేదు. ద్రావిడభాషలలోను లేదు, 'తెలుగుంబ్రాకృతభంగిన బలియుటచే నేకవచన బహువచనంబులుగాని ద్వివచనంబులు లే'వని విన్నకోటపెద్దనా ద్యాలంకారికులు చెప్పియేయున్నారు. తమిళమునుండి సంస్కృతమునకు పదములు ఎక్కియుండునని ద్రావిడభాషా పరిశోధకులు చెప్పుచున్నారు. మఱియన్ని ప్రాంతీయభాషలనుండియు గ్రహింపబడి సంస్కరింపబడియుండినది వాస్తవమైనయెడల ఇందాశ్చర్యమేమి? తమిళప్రాకృత సంబంధములు పరిశోధనార్హములు.

ఆంధ్రశాతవాహనులకు సమకాలముదిగా కనబడు సంఘం వాఙ్మయములో శాలివాహన సప్తశతిలోని భావములు చాల కనబడుచున్నవి — అహనానూరు పురనానూరు ఇత్యాదులవలె నిదియు సంకలన గ్రంథముగదా. మామూలనారను సంఘకవి శాతకర్ణులను (నూట్రువర్ కన్నర్) పేర్కొనుచున్నాడు, మౌర్యులు దుష్టులన్నాడు (వంబమోరియర్). ఇదికూడ పరిశోధింపదగినది.

భారతదేశమందు ఆసేతుహిమాచల పర్యాప్తముగా రాకపోకలు, రాజకీయాదులు, వాణిజ్యవ్యాపారములు జరుగుచుండినందున పదజాలము వ్యాపించియుండువనుటలో సందేహముండనక్కరలేదు. క్రీ. పూ. 300 ప్రాంతముననే చంద్రగుప్తమౌర్యుని యాస్థానమునకువచ్చిన గ్రీకు రాయబారి మెగాస్తనీసు, పాండ్యులను, పాండ్యకవాటమును పేర్కొన్నాడు. ఈ కవాటము పాండ్యుల రాజధాని. తమిళములో దీని పేరు కపాడపురం. మూడుసంఘములలో రెండవసంఘము వెలసినచోటు, అశోకుడు తన శాసనములలో దక్షిణప్రాంతీయులనుగా పాండ్య చోళ కేరళపుత్ర సత్యపుత్రు లనువారిని పేర్కొనెను. క్రీ. పూ. 165 లో కళింగఖారవేలుడు తనకు పశ్చిమముననుండిన శాతవాహనులను జయించుటయేగాక, తన కాలమునకు దాదాపు వంద సంవత్సరముల నుండియు సంయుక్తరాజ్యములుగా కలసియుండి మహాసముద్రములమీద నౌకావ్యాపారము చేయుచుండిన చేరచోళపాండ్యప్రభువుల సముద్రాధిపత్యమును తన నౌకాబలముచేత ధ్వంసమొనర్చెనని శాసనము ప్రతిష్ఠించియున్నాడు. ఇదంతయు ప్రాకృత వాఙ్మయకాలము.

శాతవాహనుల పతనానంతరము క్రీ. శ. మూడవ శతాబ్దమున పల్లవులు తలయెత్తి సంస్కృతము క్రమముగా దేశవ్యాప్తమైనది. సంఘం వాఙ్మయమున పల్లవుల ప్రస్తావన బొత్తిగా లేదనియు అందుచేత వారు తలయెత్తుటకు ముందే సంఘం వాఙ్మయము పూర్తియైనదనియు తమిళ పండితుల యభిప్రాయము. అదిమొదలు దేశపర్యాప్తముగా సంస్కృతము అభివృద్ధికాగా తమిళముయొక్క పురోగమనము కొంత మందగతి చెందినది. పల్లవ మహేంద్రవర్మ వఱకును జైనులు తమిళదేశమున రాజాదరము నందియుండిరి. అటుతర్వాత శైవులు రాజులను తమ మతమునకుత్రిప్పి క్రమముగా దేశమందు జైనమతమునకు పలుకుబడిలేకుండ జేసిరి. పల్లవుల రాజధాని కాంచీనగరము. వీరు తమిళమును ఆదరింపలేదుగదా, మఱి ఆంధ్రదేశమునుండి

తమిళదేశమునకు వ్యాపించినవారు వీరు.బలవంతులై చేరచోళ పాండ్యులను జయించి సింహళపర్యన్త వ్యాప్త సామ్రాజ్యమును జయించుటయేగాక ఉత్తరమున కర్ణాటకులైన చాళుక్యులతోను తూర్పున వేంగిచాళుక్యులతోను యుద్ధములు చేయుచుండిరి. వీరు తమిళులు కారనియు చేరచోళ పాండ్యులే తమిళులనియు తమిళపండితుల యభిప్రాయము. ఇట్లుండగా ఆశ్చర్యకరముగా, ద్రావిడశబ్దము ఇతరుల కెవరికిని అన్వయింపక ఒక్క పల్లవులకుమాత్రమే అన్వయించుచున్నదని కీ. శే. శ్రీ ముట్లూరి వెంకట్రామయ్యగారు (నామిత్రులు) చిరకాలముక్రిందనే ప్రకటించిరి. Journal of Oriental Research ఈ విషయమునే ఇటీవల శ్రీ డా. రమేశన్‌గారు బలపఱచిరి. (చూ. హైద్రా. శాసన.) ఇది వాస్తవమైనయెడల తమిళ ద్రవిడశబ్దములు భిన్నార్థకములా యను పెద్ద సందేహము కలుగునుగదా! మనకిచట ప్రధానము పల్లవులకాలమున దేశమందు సంస్కృతము వ్యాపించి లెక్కలేని సంస్కృతపదములు తమిళములో ప్రవేశించిన విషయము.

లౌకిక సంస్కృతవ్యాప్తిని గుఱించి ఇప్పుడు వివరింపవలయును. తమిళములో ప్రవేశించిన సంస్కృతపదముల చరిత్ర పరిశోధింపదగినదే గాని సంస్కృతము మాత్రము బొత్తిగా కల్తీలేనిభాషయని జెప్పజాలము. కాళిదాసునాటికే అన్యదేశ్యములు ప్రవేశించినట్లు తెలియుచున్నది. యవనులును హూణులును కాళిదాసునకు చాలముందే మన దేశమందు ప్రవేశించిరిగదా. 'కేంద్రము', 'జామిత్రము' ఇత్యాదులు గ్రీకుపదములే. ఆంగ్లమున సింహమునకు Lion అను పదమునకు సరియైన 'లేయ' అను పదము మన జాతకగ్రంథములలో ప్రవేశించియున్నదిగదా. సింహరాశిని 'లేయ' అన్నారు. "క్రియ, తాబురు, జితుమ, కుళీర, లేయ, పథోన, జూక, కౌర్పాఖ్యాః తౌక్షిక ఆకోకేరోహృద్రోగశ్చాన్త్యభంచేత్థమ్" (వరాహమిహిరుడు.) తర్వాతకూడ మహమ్మదీయులకాలమున 'సుల్తాను' అనునది 'సురత్రాణ' శబ్దముగా మాఱివచ్చినది. శ్రీకృష్ణదేవరాయలు 'హిందు సురత్రాణో దుష్టశార్దూల మర్దనః అనబడినాడు. హిందూశబ్దముకూడ మనదికాదు. ఈ విషయమును కిట్టెల్ పండితుడు తన Kannada - English నిఘంటువులో నిట్లు వ్రాసియున్నాడు (Preface to the First Edition p. 28)

"Kumarila Bhaṭṭa who lived about 800 A. D., says in his Tantravarttika (see Dr. A. C. Burnell in the Bombay Indian Antiquary, No. for October, 1872) 'It is now considered (as regards) words which are not known to the inhabitants of Āryāvarta, if they have a meaning known to the Mlecha, is that to be accepted or not?' He suggests (but only to reject the notion) that by application of affixes etc, it may be passible to convert them into Samskrita words, and gives the following examples; *cor*, boiled rice (i. e. T *coru*) *nader*., way (i. e. K. M. *nade*, T. *nadai*) *pāmp*, snake (T. *pāmbu*, K pāvu, etc.) *āl* a person (D. *āl*) she (Te.) and *vir*, belly (T. vayiru, K. *basiru*, etc.) ఇచ్చట కిట్టెల్‌గారి అధోజ్ఞాపిక - 'Of these five Dravida terms vair is probably *vera*, the body, of Samskrita Dictionnaries'). What Kumarila suggested had been done somehow before and was done so alterwards; on the other hand there are twentyone words, the so-called Tatsamas, which, as it seems, are acknowledged by Pandits to have been introduced into Samskrita from Dravida without undergoing any alteration (పుట 29 కిట్టెల్‌గారి రెండవ యధోజ్ఞాపిక - They are the following: anka, angana, atta, kankana, kote, ganda, galla, gāla, goni, tala, torana, patta, bandi, bala, bila, manca, mani, malla, male, lata, sabala. They are different from the so-called Samskrita words) As a rule, however, the Aryas in adopting a Dravidian word changed it considerably in order to suit it to their tongue and whenever such a word was imperfectly understood or negligently reproduced, the change naturally became still greater. It is more than probable that Samskrita

borrowed a number of words also from Dravida tribes the dialects of which are unknown to us, so that in such a case it becomes very difficult and even impossible to trace their origin." (ఇచ్చట సగముపుట నిండుగ ఒక యధోజ్ఞాపికలో చాల పదముల నిచ్చినారు.)

మరల దేశచరిత్రను చూతము. పల్లవులు తొమ్మిదవశతాబ్ద ప్రారంభకాలముననో పదవశతాబ్ద కాలముననో బలహీనులై పతనమందగా చోళరాజులు తలయెత్తిరి. వీరికాలమున శైవమతము వైభవముతో వెలయుచుండగా వైష్ణవమతము తలయెత్తి మరల తమిళభాషకు ప్రాధాన్యమీయసాగినది. చోళులు క్రీ. శ. 950 ప్రాంతమునుండి 1250 వఱకు పాలించి, ఆర్యావర్తముదాక దండయాత్రలు చేసి లయమొందిరి. వీరి క్షీణకాలమున పాండ్యులు తలయెత్తిరిగాని ఇంతలో మహమ్మదీయ దండయాత్రలు దేశమును కళవళపెట్టి, గొప్పగొప్ప రాజ్యములను కూల్చి, మధురలో ఒక మహమ్మదీయ సుల్తాన్ రాజ్యస్థాపనకు దారితీసినవి. ఇంతవఱకు ఎందఱో రాజపుత్రులు, వారి యాశ్రితులైన బ్రాహ్మణ బ్రాహ్మణేతర కుటుంబములు దక్షిణదేశమునకువచ్చి స్థిరనివాసము లేర్పఱచుకొని తమ సంస్కృతిని, నూతన పదజాలమును అన్ని భాషావర్గముల వారికిని ఇచ్చినవి.

ఈ కాలమునకు సరిగా దక్షిణాపథ చరిత్రను సంగ్రహముగా చూచుట మంచిది. ఆంధ్రులును కర్ణాటకులును ఆదిలో భిన్నులుగారు. ఆంధ్ర శాతవాహనులవలన ఆంధ్రత్వము వచ్చినట్లే వారి శాతకర్ణి శబ్దమునుండి 'కర్ణినాడు' కర్నాడు, కన్నాడు, కర్ణాటక శబ్దములు వచ్చియుండవలెనని కొందఱు ఆంధ్రులైన పెద్దల యభిప్రాయము. ఆకర్నినాడు ఆంధ్రదేశమందలి కర్నూలు మండలాంతర్గతమని కూడ తెలుపుచున్నారు. ఇందులకు అనుగుణముగా తెనుగు తెలుగుపదములు జాతిపరముగాగాని దేశపరముగాగాని ఎచ్చటను ఈ ప్రాచీనకాలమున కానరావు. దాదాపు క్రీ. శ. పదవ శతాబ్దమువఱకు తెలుగన్నమాట వినబడదు. శాతవాహనులనుండి ఇంతవఱకు ఇన్నిశతాబ్దములకాలము ఆంధ్రభాషకును వాఙ్మయమునకును ఒక పరిణామకాలము. సాతవాహనులనాడు కన్నడమను పేరుగాని తెలుగను పేరుగాని రెండును లేవు. వారితర్వాత దక్షిణాపథమునందు తూర్పుభాగమును సాలంకాయన విష్ణుకుండిన ఇక్ష్వాకు పల్లవ ప్రభృతులు పాలించిరి. పల్లవులు కాంచీనగరమున చేరి తర్వాత గొప్పవారైనవిషయము ముందే గ్రహింపబడినదిగదా. ఇట్లే సమకాలికముగా పశ్చిమభాగమునవెలసిన రాజ్యములు నల మౌర్య కదంబ గాంగ చాళుక్య రాష్ట్రకూటాది రాజకుటుంబములవి. వీరిలో బాదామిరాజధానిగా చాళుక్యులు విజృంభించి తూర్పున కళింగమువఱకు నుండిన ఆంధ్రదేశమును జయించి, వేంగియందొక చాళుక్యరాజవంశ శాఖను స్థాపించిరి. ఇది క్రీ. శ. ఏడవశతాబ్ద ప్రారంభ కాలమున జరిగినది.

ఇంతవఱకును ఎక్కడను కన్నడమను పదముగాని తెలుగను పదముగాని కానరాదు. ఇది చాల విచిత్రము. కాని ఈ రెండింటిలో కర్ణాటమను పదము కొంత ముందుగా కనబడుచున్నది. అతిప్రాచీన ప్రయోగము శిలప్పదిగారములో కలదు. కాని అందలి కథనుబట్టి ఆ పదము వాస్తవముగా మూలకవి ప్రయుక్తమా లేక ప్రక్షిప్తమాయని సందేహము కలుగుచున్నది. కథలోను కొంత విచిత్రము కలదు. శేరన్ (చేర - కేరళ - దేశపురాజు) కన్నగికి శిలాప్రతిష్ఠ చేయుటకు హిమవత్పర్వతమునుండి చక్కని శిలను తెప్పించుటకు ఆర్యావర్తముమీదికి దండెత్తగా, ఆతని సైన్యములు పశ్చిమసముద్రతీరముననుండిన కరూరు నుండి నీలగిరికివచ్చి అచటినుండి మహావిజయమునకు బయలుదేఱినవట. వీరికి కర్ణాటకులు,ఓవియరు(?)కుడగరు(?) సహాయపడిరట. ఆంధ్రులు దారియిచ్చిరట, మాళవపాలకులైన 'నూట్రువర్‌కణ్ణర్'లు (నూటివారు కణ్ణరులు = శాతకర్ణులు) సహాయపడగా, తమిళసైన్యములు గంగను దాటి (ఎచ్చటనో ?) 'కనకన్' 'విజయన్' అను ఆర్య

రాజులను 'కుయిలాలువం' (?) అనుచోట జయించి, వారి తలలమీద కన్నగికొఱకై గ్రహించిన శిలను మోయించుచు తమిళనాడుకు తెచ్చినాడట, ఆ రాజు శేరజా శెంగుట్టువజా అనువతడు. ఆయూరేగింపు చోళపాండ్య రాజ్యములగుండ పోయినదట. పిదప ఆరాతిలో కన్నగిప్రతిమను చెక్కించి కరూరులో గుడికట్టించి అందులో ఆరాజు దానిని ప్రతిష్ఠించి నాడట. ఆ యువత్సవమునకు సింహళపురాజు గజబాహువు (క్రీ. శ. 177-199) వచ్చియుండినాడనుటవల్ల దీని కాల మును క్రీ. శ. రెండవ శతాబ్దముగా నిర్ణయించినారు చరిత్ర కారులు. ఇదంతయు శిలప్పదిగారపు పాటగాని (కట్టుకథ గాని) చరిత్రకాదని కొందఱి యభిప్రాయమని శ్రీ డా టి. పి. మీనాక్షిసుందరంగారు వ్రాసియున్నారు. ఇందలి కరు నాడగర్ ఎవరో? రెండవ మూడవ శతాబ్దములనడుమ దక్షిణాపథమందు శాతవాహనులుతప్ప ఇతరులు లేరుగదా. శాతవాహనుల సమకాలిక గ్రంథమైనచో చారిత్రక వివర ములు చక్కగా నుండవలదా. గజబాహువు పేర్కొన్న వాడు శాతకర్ణి ఎవడో చక్కగా తెలుపవలదా? ఈ సాక్ష్యము అనుమానాస్పదము.

చాళుక్యులు పాలించినదేశము కర్ణాటకమని కన్నడ పండితుల యభిప్రాయము. కాని వారి శాసనములలో ఈ పదము లేదు. మహాభారతమునందును పురాణములలోను కలదుగాని ప్రక్షిప్తముగా నుండును. ఆరవ శతాబ్దమున వరాహమిహిరుని బృహత్సంహితలో కలదు. దానికి సమ కాలికమైన కదంబ ప్రథమ విష్ణువర్మ శాసనమందు 'వైజయ స్త్రీ తిలక సమగ్ర కర్ణాట భూవర్గ' అని కలదు. సంస్కృతనాటకములలో, పెక్కుగుణములలో విచిత్ర మైన, మృచ్ఛకటియందు కర్ణాటకకలహ మను పదము కలదు. తర్వాత నృపతుంగబిరుదాంచితుడైన ప్రథమా మోఘవర్షుని (క్రీ. శ. 81+-877) కవిరాజమార్గములో స్పష్టముగా కావేరినుండి గోదావరి వఱకు గల దేశమందు మధురమైన కన్నడభాష కలదని చెప్పబడియున్నది. చూడగా బాదామిచాళుక్యులు పాలించిన దేశమునకు కర్ణాటక దేశమని పేరుండినట్లు తెలియుచున్నదని శ్రీ H. C. రాయ చౌదరిగారు వ్రాయుచున్నారు. (Geography of the Deccan - Early Histry of the Deccan Vol I p. 40) కాని వీరే ఇంకను చర్చించి, పైని పేర్కొన్న 'సమగ్ర కర్ణాట భూవర్గ' మేనో స్పష్టముగా చెప్పుటకు సాధ్యము కాదనియు, కొందఱు శ్రీశైలప్రాంతీయ కర్ణవిషయమే ప్రాచీన కర్ణాటకమని వ్రాయుచున్నా రనియు (శాతకర్ణ+ నాడు, కర్నాడు, కన్నాడు) కాని అది కుదురదనియు, కరినాడు అనగా 'నల్లమట్టినేల' యనియు, కొందఱు కన్నడాభిమానులవలెనే పై గ్రంథమందు వ్రాసియున్నారు.

ఈ కన్నడ విషయమును మొదట ప్రతిపాదించినవా రెవరోగాదు, మనవారే శ్రీ డా. నేలటూరు వెంకటరమ ణయ్యగారు. JOURNAL OF ANDHRA HISTORICAL RESEARCH SOCIETY Vol XI P. 89-99 లలో వీరు విపులముగా చర్చించి ఇట్లు నిర్ణయించినారు.—
The United Andhra kingdom must have acquired the name of Karnata (Kannadu) from the original home of the Satakarnis at the foot of the Srisaila mountain. It must have been in this manner that the Telugu and Kannada countries came to obtain the common name of Karnata. There is nothing improbable in this. Instances of large areas obtaining their names from small districts and ruling families are not unknown ...... Karnata, which generally denoted the Canarese country in the 14 th cen., became the designation of the whole of South India upto Rameswaram with the expansion of Vijayanagara."

కరినాడను నది నల్లమట్టినేల యనుటకు ఎక్కడను ప్రమాణము లేదు. పై రాయచౌదరిగారే ఈ క్రింది శ్లోక మును (కన్నడవాదులవలెనే) ఉదాహరించి అందలి 'కృష్ణ వర్ణము' నల్లభూమికి సంబంధపడిన దన్నారు.—

"విఖ్యాతకృష్ణ వెణ్ణా తైలస్నేహోపలబ్ధ సరలత్వే
కుంతలవిషయే నితరాం విరాజతే మల్లికామోదః"

ఇందు శ్లేషకలదు. 'మ ల్లి కా మో ద' యనునది చాళుక్య చక్రవర్తి రెండవ జగదేకమల్ల జయసింహుని బిరుదు. ఇతనికాలము 1015 - 1042, ఇతని తాత తైలప చక్రవర్తి. కృష్ణవేణి, కృష్ణవెర్ణ, కృష్ణవెణ్ణా, కృష్ణపెన్న ఇత్యాదులు మన కృష్ణానదికి శాసనములలో కనబడు పేళ్లు, కుంతలమనునది ప్రాచీన కర్ణాటకకుంతలము. ఒక శాత కర్ణికి 'కుంతలశాతకర్ణి' యని వాత్స్యాయన కామసూత్ర మందున్నది. ఇప్పుడు శ్లోకార్థమును చూతము - మల్లికా మోదము = మల్లికామోద బిరుదాంచితుడు, మల్లికాపుష్ప ముల పరిమళము, తైలము పూయుటచేనైన నూనెవలని సారళ్యముచేత, తైలచక్రవర్తియొక్క స్నేహసంబంధము వలని అనుకూల్యముచేత (స్నేహమనగా నూనెకూడ) తలవెండ్రుకలకు నూనెపూయుదురుగదా, కుంతలవిషయ మందు - తలవెండ్రుకల కొప్పులో, కుంతలమను పేరుగల దేశమందు, ప్రఖ్యాతివహించిన కృష్ణవేణీ నదియొక్క, విఖ్యాతినందిన నల్లనిజడలో, ఎల్లప్పుడును ప్రకాశించు చున్నది. —— ఇచ్చట భూమి విషయము కుంతలము. కృష్ణవర్ణముకాదు అది కృష్ణవేణి. కృష్ణపాలుదేశమంతయు పూర్తిగా నల్లమట్టిదేశమా? ఈ పండ్రెండవ శతాబ్దపు శ్లోకమునుమాచి శ్రీ రాయచౌదరిగారు ఇంకను అపభ్రంశ ముగా ఇదియే తెలవాహానదియనియు వ్రాసినారు. "...the name Televaha 'oil carrier' may actually refer to the Krishnavena or the Krishna as hinted in the passage' (Early His. of the Dec p. 28)వీరినిపలు వురు అనుసరించినారు. దేనికిదేనికి సంబంధమో! కర్నాట కమున ఒక్కనల్లమన్నేగాక ఎఱ్ఱమన్నుకూడ నున్నది.

శాతకర్ణులు పోయిన తర్వాత అంతటి మహా సామ్రాజ్యము కాకపోయినను దానికి ఇంచుమించు సరి పోవు సామ్రాజ్యమును సాధించిన చాళుక్యులవలన దీని కీపేరువచ్చినది కుదురునట్లైన, దానికి అనుగుణముగా చాళ క్యులను ఆంధ్రులేయనియు, మొదట వీరుండినదికూడ శ్రీశైలప్రాంతమే యనియు తెలియగలదు. చాళుక్యుల ప్రాచీనతమ శాసనమున, ఇక్ష్వాకు వీరపురుషదత్తుని మహాసేనాధిపతి, మహాతలవరుడు, వాసిష్ఠీపుత్రఖండచలికి రెమ్మణకుడనువాడు - అచట పాలించుచుండెనని నాగార్జున కొండశాసనములచేత బయలుపడినది. ఈ చాళుక్యులు శాత వాహనుల సామంతులుగా నుండిరనుట చరిత్రకారుల యభి ప్రాయము. వీరుండినది చాళుక్యభూమియని, నేటి రాయల సీమలోని కర్నూలుప్రాంతమని ఇటీవల చాల విశదముగా తేలినది. (చూ. శ్రీ. డా. రామేశన్‌గారి Copper Plate Ins. of Hyderabad Museum p. 2. and 42-43; The Tummeyanuru grant of Pulakesin II.) 'It is very clear that the *Chalukya Vishaya* should have formed part of the Rayalasima districts, inclusive of Kurnool and perhaps part of the Mahaboob - nagar dt., also. The *Chalikis* or *Chalukyas* must hame been originally the inhabitants of the *Rayalasima* districts and probably were living in the neighbourhood of Srisaila and their homeland must have come to be called as Chalukya Vishaya after them." (p. 43)

ప్రాచీనాంధ్రసామ్రాజ్యము క్రమముగా . ఆంధ్ర కర్ణాటకములుగా విభక్తమైనదనియు, ఒక్క సంస్కృతికి చెందిన జనులే విభక్తులైరనియు మొన్నమొన్నటివఱకు కూడ వీరికి అభేదప్రతిపత్తి యుండెడిదనియు చరిత్ర చెప్పుచున్నది. భాషాభివృద్ధినిబట్టి చూచినను ఈకాలముననే, చాళుక్యుల యభివృద్ధితో, దేశము క్రమముగా సంస్కృత మును వదలి ప్రాంతీయభాష నాదరింపసాగినది. ద్రావిడ భాషలలో రెండవదిగా కన్నడము రూపుదాల్ప నారం భించినది. కవిరాజమార్గకాలమైన రాష్ట్రకూటయుగమున మహోన్నతినంది పొన్న పంప మహాకవులకు ఆశ్రయ మిచ్చినది. ఇచ్చట మఱియొక యంశమును చక్కగా గ్రహింపవలెను. ఇందువలన ఆంధ్ర కర్ణాటకుల విభేద చరిత్రయొక్క పరిణామము తెలయును. వేంగినుండి మహాకవుల కుటుంబములు కన్నడ రాజాస్థానములకుపోయి రాజాశ్రయమునంది కవిత్వము చెప్పినవే. పొన్నపంప

కవులు నన్నయభట్టునకు సరిగా ఒక శతాబ్దము ముందుం డినవారు. వీరిది వేంగిదేశమందలి (గుంటూరుజిల్లాలోని) వంగిపఱ్ఱు. ఇదియే తర్వాతి వంగీపురము, పెక్కురు వైష్ణవుల స్వగ్రామము, ఇంటిపేరు. (చూ. డా. నేలటూరి వెంకటరమణయ్యగారి వేంగి చాళుక్యులు - పల్లవులు చాళుక్యులు.) అది ఆంధ్ర (తెలుగు) కవితకు పరిణామ కాలము. పద్యరచన యుండినను కావ్యములేదు. ఏదైన నేమని తెలుగువారు రెండుభాషలును తమవేగావునను, లిపి యొకటే యైనందునను కన్నడమందు కావ్యములు రచించిరి.

ఇంతవఱకును తమిళ కన్నడముల ప్రారంభచరిత్ర యైనది. ద్రావిడభాషలను మాటలాడుచుండినవారెవరోగాని భాషాసాదృశ్యము కనబడుచుండుటచేతను, వాఙ్మయసాదృశ్యము కానరానందునను కన్నడిగులును తెలుగువారును సంఘం వాఙ్మయమునకుముందే విడిపోయి యుండవలెను, మఱియొకవిషయము ఆంధ్రభాషయు తెలుగుభాషయు, ఆంధ్రులును తెలుగువారును, ఒక్కటియు ఒక్కరునుగా నుండినయెడల రెండు పేర్లేల వచ్చినవి? మన భారతదేశ మందలి మఱి యేభాషకుగాని జనులకుగాని వ్యవహారమున రెండుపేర్లు లేవుగదా. తమిళమును ఆంధ్రులు అఱవమను చున్నారు, వారిని అఱవవారనుచున్నారు ఇతరులనుటలేదు. అట్లే తమిళులనుకన్నడమువారు 'తిగుళరు' అనుచున్నారు. కన్నడ కర్నాటకములుగాని మరాఠీ మహారాష్ట్రములుగాని వంగ బంగాళములుగాని గూర్జర గుజరాతములుగాని వేఱు వేఱు పదములుగాక ఒక్కపదమునకే మార్పులు, ద్రావిడ సంస్కృతరూపములు, మఱి తెలుగు ఆంధ్రములు బొత్తిగా సంబంధము లేనివిగదా. ఇది పరిశోధింపదగినది. అఱవ తిగుళ శబ్దముల యర్థమును గ్రహించి తెలుగునకు వచ్చుట మంచిది.

అఱవాళర్ అను జాతి జనులు కాంచీనగరమునకు చుట్టుపట్లనుండిన రాజ్యభాగమున కాంచిమండలమున-అనగా నేటి తొండైమండల మనబడు దేశమున - కడలూరునుండి చెంగల్పట్టుజిల్లాతోచేరి నాయుడుపేట కాళహస్తి తిరుపతుల వఱకు నుండిన దేశమున - అతి ప్రాచీనకాలపు సంఘం వాఙ్మయముకాలమున నుండినట్లు తెలియుచున్నది. వీరే టాలెమీ చెప్పిన అర్బినాయ్ అనువారు. అఱవమనగా పాముని యర్థము, నాగులు. ఈ నాగులు పల్లవులకు బంధువులై తర్వాత కాంచీరాజ్యమును గ్రహించినట్లు కథలు గలవు. కంచికి అఱువావడతలై, అనగా అఱువ నాటియొక్క ఉత్తరపుభాగమునకుతల యని యర్థము - అను పేరుండెను. ఆంధ్రులో తెలుగువారో వీరితో మొదటమొదట సంపర్కముగలిగి క్రమముగా దక్షిణ దేశము నంతటిని అఱవదేశమనుట ఏర్పడినది. సంఘం గ్రంథములలో ఈ ప్రదేశమును 'కొడుంతమిళ్' (అపరిష్కృత తమిళము) మాటలాడు దేశముగా పేర్కొన్నారు. తమిళులే ఆంధ్రులను 'వడుగర్' అన్నారు, అనగా ఉత్తరపువారు. అంధ్రాపథమును 'వడుగవఴి' = ఉత్తరపు మార్గము అన్నారు.

తిగుళదేశము, 'తిగుళభూములు' కన్నడదేశమునకు తమిళదేశమునకు నడుమ కొంతదేశము. కావేరీనదికి ఉత్తరమునుండి కన్నడభూమియైనదానికి దక్షిణమున కొంత. ఇచ్చట నేటికిని తిగుళజాతులవా రున్నారట. తమిళము మాటలాడెడివారుగాన తమిళుల నందఱిని కర్నాటకులు 'తిగుళ' వారనిరి. ఇది పరిశోధనీయాంశము. మఱి తెలుగు ఆంధ్రముల సంగతి చూతము.

ఆంధ్రులు ఐతరేయోపనిషత్తుల కాలమునుండియు కనబడి క్రీ. శ. దాదాపు 250 వఱకు పాలించి అస్తంగతులైన శాతవాహనులనుట తెలిసినదే. అందులోను ఆంధ్రులు లేక అంధ్రులు వేఱనియు, వారు పోయినతర్వాత వారి భృత్యులు ఆంధ్రులు (ఆంధ్రభృత్యులు లేక ఆంధ్ర భృత్యులు) పాలించిరనియు, ఈ యాంధ్రభృత్యులే శాత వాహనులనియు అభిప్రాయభేదములుకలవు. సరి, పోనిండు.

పదియవ శతాబ్దము వచ్చువఱకు తెనుగు తెలుగుపదములు కనబడవుగదా. ఇందులకు కారణము లనేకములు. ప్రాచీనాంధ్రులు తెలుగువారుకారు. వీరు మఱియొక జాతివారు; దక్షిణదేశమునుండి బయలుదేఱి క్రమముగా ఉత్తరమునకు ఎగబ్రాకి పదునొకండవ శతాబ్దమునాటికి ఆంధ్రదేశమును ప్రవేశించి ఆంధ్రులలో కలసిపోయి నన్నయనాటికి 'ఆంధ్రులే తెలుగువారు, తెలుగువారే ఆంధ్రులు' అనునంతటి ఐక్యమును సంపాదించిరి. ('తెలుగువారెవరు' అని 1969 - 70 సౌమ్య, ఆంధ్రపత్రిక ఉగాది సంచికలోని నా వ్యాసమును చూడుడు)

నేటితెనుగులో కనబడు సంస్కృతేతరపదములు, కాదా సంస్కృతప్రాకృతేతరపదములు పెక్కులు శాతవాహనులకాలమునుండియు కనబడుచునేయున్నవి. ఇవి ద్రావిడపదములా కావా తెలియదు. ప్రాకృతభాషయొక్క స్వరూప మింకను పరిశోధించి తేల్పబడలేదు. కాబట్టి, చారిత్రక సిద్ధాంతము కుదురదు. ద్రావిడపదములు బెలూచిస్థానమందలి బ్రాహూయిభాషదగ్గఱినుండి, రాజమహాలు ప్రాంతీయభాషలలోను, నడుమనడుమ దేశమందు కొన్ని పదములు, అక్కడ ఒకగుర్తు ఇక్కడ ఒకగుర్తుగాను, తెలుగుభాషాపదములవలెను, తెలుగుమర్యాదలతోనుండుటచేతను, తెనుగును ద్రావిడభాషలతో వర్గీకరించినందువలనను, ఒక కట్టడముమీద మఱియొక కట్టడముగా కట్టి, ద్రావిడులు ఆసేతు హిమాచలమందేగాక, ఇంకను దాటి ఉండిరనియు, ఆర్యులనబడువారివలన క్రమముగా దక్షిణమునకు నెట్టబడిరనియు సిద్ధాంతము లేర్పడినవి.

ఇట్లు, ఒక్కొక్కమెట్టు ఒక సిద్ధాంతముగా, సిద్ధాంతముమీద సిద్ధాంతమును నిర్మించుకొనుచు పోవుటలో ఏ చిన్నసిద్ధాంతము కదలిపోయినను మరల కట్టడమంతటిని, భూకంపముచేత పడిపోయిన ఇంటివలెనో ఊరివలెనో పూర్తిగా పునాదితో మరల నిర్మించుకొనవలసినదే. తెలుగెంతవఱకు ద్రావిడభాష, ప్రాకృత ద్రావిడముల సంబంధమెట్టిది, అసలు ద్రావిడభాషల స్వరూపమేమి, సంస్కృతము పూర్తిగా వీనికి భిన్నమా లేక కలగాపులగమా, వైదికసంస్కృతమునకును ప్రాకృతములకునుగల సంబంధమేమి-ఇవన్నియు చరిత్ర తెలియక, పదజాల వ్యాకరణాంశములమీద మాత్రమే ఆధారపడినయెడల తెలియుట కష్టము. ఆర్యులనబడువారు ఇక్కడివారే, ఎక్కడినుండియో రాలేదను పరిశోధకులును కలరు. ద్రావిడులెవరు, ఏది ద్రవిడదేశము, ద్రవిడులే తమిళులగుదురా, పల్లవులుమాత్రమే ద్రవిడులైన, చోళచేరపాండ్యు లెవరగుదురు, మఱి వీరికి నౌకాయానాది కౌశలమున్నదే, హిమాలయాది పర్వతదేశ ప్రాంతములనుండి ఎప్పుడు క్రిందికిదిగి, ఎప్పుడు నౌకాయానశక్తిని సంపాదించి రాజ్యములు నిర్మించుకొనిరి? లేక ఎచ్చటినుండియైన వచ్చిరా? ద్రావిడులు మధ్యధరాసముద్ర ప్రాంతమునుండి సముద్రయానమున మనదేశమునకు వచ్చినట్లును సిద్ధాంతములు కలవే? శాతవాహన కళింగులును నౌకాప్రయోగ కుశలులే. మఱి వారి ఆదినివాసము లెక్కడివి? - ఇట్టి సందేహపరంపరలో జాగ్రత్తగా పరిశోధింపవలసియున్నది.

మనకిప్పుడు తెలుగు ముఖ్యము. రేనాటిలో తెలుగు చోళులు తలయెత్తినది మొదలు తెలుగు తెంపులేక తిన్నగా కనబడుచున్నది. ఏడవ శతాబ్దమునుండి వర్ధిల్లి ఎనిమిది తొమ్మిది శతాబ్దములనాటికి చక్కని పరిణామము నందినది. తొమ్మిదవ శతాబ్దమునాటికే పద్యములు కనబడుచున్నవి. పూర్వము ప్రాకృత సంస్కృతశాసనము లుండినచోట తెలుగు ఎక్కువ కాసాగినది ఈ భాషావ్యాప్తికిని తెలుగు చోళరాజ కుటుంబములవ్యాప్తికిని సంబంధము కనబడుచున్నది. పదునొకండవ శతాబ్దమునాటికి తెలుగు చోళులనే ప్రత్యేకముగా తెలుగువారని చెప్పుటయు, ఇతరుల నాంధ్రులనుటయు, రాయలసీమ తెలంగాణ ప్రాంతములో కన్నడశాసనము లుండినచోటులలో తెలుగు ప్రాధాన్యము వహించుటయు, కృష్ణానదికి దక్షిణమందుండినవారినే తెలుగువారనుటయు వేంగీ తెలంగాణములవారినే ఆంధ్రులనుటయు

వింతగానున్నది. ఈ చోళులు తాము కరికాలచోళుని వంశ స్థులమని చెప్పుకొనుటయు, కావేరిని, దానిదరియందలి ఒరయూరిని ప్రశంసించుటయు, అక్కడి కథలను ఇక్కడి ప్రదేశములకు సమన్వయించుటయు, ప్రాచీన తమిళదేశ మందలి పల్లవశాసనములలో తెలుగు బిరుదులును, తెలుగు కవిత్వములో తమిళములోవలె యతిప్రాసలు రెండును ఉండుటయు, కన్నడములో ప్రాసమాత్రముండుటయు, సంస్కృతమందు ఈ రెండును లేకపోవుటయు చూడగా తమిళదేశమునుండివచ్చిన చోళులును వారితోచేరినవారియొక్క యాశ్రితులును తెలుగువారనియు వారి భాషాప్రభావమే మన మీద నెక్కువయనియు తెలియుచున్నది. కాని తమిళదేశ ములో వీరికి తెలుగువారని పేరులేదు. ఆ పేరు రేనాటి లోను కనబడినదికాదు. తులుదేశమునుండి ఎందతో పల్ల వులకాలమున ఈ ప్రాంతములకు వచ్చి ఈ రాజుల నాశ్ర యించి ఇక్కడివారైపోయిరి. ఒకశాసనములో తెలుగునకు 'తిలు' అని ప్రయోగము కలదు. తెనుగుకన్నను ప్రాచీన రూపము తెలుగే, లకారమే ముఖ్యము. తిలు పదమే తెలు పదమైయుండునని తోచుచున్నది. గకారము తర్వాత చేరినది. ప్రాచీన మహారాష్ట్రి యాదవులు, కాకతీయ రుద్ర దేవుని 'తిల్లింగాధిపతి' యన్నారు. తిలింగ్, తిలంగ్ రూపములే ప్రాతవి. కాకతీయులు మొదట కన్నడము నాదరించి, తర్వాత రుద్రదేవునినాటికి తెనుగు నాదరింప సాగిరి. శాసనములలో మార్పు కనబడుచున్నది.

కాకతీయులు కూడ ఎక్కడివారో తెలియదు గాని 'కాకంది' వారి మూలస్థానమైనయెడల, కావేరీతీరమందలి ఒరయూరు ప్రాంతమునకే ప్రాచీన తమిళవాఙ్మయమందు 'కాకంది' యను పేరు కనబడుచున్నది. అది సముద్ర ములో మునిగిపోయినదట. (కడల్కొండ కాకంది) తర్వాత, నెల్లూరుజిల్లా, గూడూరుతాలూకాలోని సముద్ర తీరప్రాంతపు రాజుపాళెమునకును పూర్వ శాసనములలో 'కాకన్ది' యని కలదు. ఇట్లీ కాకందియొక్క వ్యాప్తిని చూడగా, దానికి వాస్తవముగా సంబంధపడినవారైనచో, కాకతీయులును కావేరీతీరవాసులైయుండి క్రమముగా ఆంధ్ర దేశమును ప్రవేశించియుండవలెనని తోచుచున్నది. కాని ప్రాచీనాంధ్రులు పాలించిన రాజ్యభాగమున మొదట ప్రభు త్వము స్థాపించుటచే వీరిని తొలుత ఆంధ్రులనిరి. తర్వాత తెలుగువారు తెలంగాణమంతయు వ్యాపించి తెలుగు కాక తీయుల శాసనభాషగా మారినవెనుక వీరికిని తెలుగువారని పేరువచ్చి 'తిల్లింగాధిపతు'లైరి.

ఈ సందర్భమున శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారిని స్మరింపవలెను. తెనుగు విజ్ఞానసర్వస్వము సంపు. 3, పు. 2 లో ఇట్లు వ్రాసిరి.— "క్రీ. శ. పదునాలుగవ శతాబ్దము మొదటిపాదములో ఓరుగంటి ప్రతాపరుద్రుని ఆస్థానముననుండిన విద్యానాథకవి తన ప్రతాపరుద్రీయములో ఈ దేశమును తిలింగ, తెలుంగ, తెలింగ అనికాక త్రిలింగ మని వ్యవహరించి శ్రీశైల కాళేశ్వర, దాక్షారామములలోని మూడు శివలింగములవలన ఈ దేశమునకు ఈ పేరు కలిగినట్లు

"యైర్దేశః ప్రభిరేవయాతి మహతీం ఖ్యాతిం
త్రిలింగాఖ్యయా
యేషాంకాకతిరాజకీర్తి విభవైః కైలాసశైలః కృతః
తేదేవాః ప్రసరత్ప్రసాదమధురాః శ్రీశైలకాళేశ్వర
ద్రాక్షారామ నివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే
జాగ్రతు."

అని శ్లోకములో సూచించియున్నాడు. ఈ శ్లోకము శైవ మతావలంబకుడైన ప్రతాపరుద్ర చక్రవర్తిని గుఱించి చెప్పి నది. కళింగము మినహాగా ఇప్పటి యాంధ్రదేశమున కంతకును కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి ప్రభువగుటచేత శివక్షేత్రములైన శ్రీశైల కాళేశ్వర దాక్షారామములను ఉజ్జా యింపుగా ఎల్లలుగా చెప్పి, ఆ క్షేత్రములలోని శివలింగ ముల వలననే ఈ దేశమునకు త్రిలింగమను పేరు కలిగి నట్లు కవి చమత్కరించినాడు. అంతియేకాని అంతకు పూర్వ మీ దేశమునకు త్రిలింగమను పేరు ఉండినట్లు

వాఙ్మయములోకాని శాసనములలోకాని ఎందును కానరాదు.... కొందఱనుకొనునట్లు త్రిలింగపదము ప్రాచీనమనుకాదు, తెలుగు - త్రిలింగ త్రికళింగ పదములనుండి గాని, తెనుగు త్రినగములనుండిగాని రానులేదు. .... .... విద్యానాథుడు చెప్పిన విషయమునే అతనికి తరువాతికాలపు తెలుగు లక్షణవేత్తలు ఉటంకించినారు."

"తెలుగు అన్నమాట నిపుడు ఆంధ్రమునకు పర్యాయపదముగా వాడుచున్నాము. ఆంధ్రపదముతో ఏమాత్రము సాజాత్యములేని 'తెలుగు' దానికి ఎట్లు, ఎప్పటినుండి పర్యాయపదమయ్యెనో తెలియదు. క్రీ. శ. పదివందలకు పూర్వపు శాసనములలోకాని వాఙ్మయములోకాని తెలుగు అను పదమే కానరాదు. తమిళ కన్నడ శాసనములలోను, ఆంధ్ర కర్నాట వాఙ్మయములలోను తెలుగుపదము పదునొకండవ శతాబ్దము ఆరంభమునుండియే కనబడును. .... .... తెలుంగు తెలింగపదములు జనవాచకము లేదా జాతివాచకముగనే కనబడును. ఒక్క శాసనములోమాత్రము 'తెలుంగనా దొళగణ మాధవియకెఱె' అను గ్రామము (ఇది మన గురుజాల, గురిగింజకు సంస్కృతము మాధవి. నరసారావుపేట తాలూకా, గుంటూరుజిల్లా - వే. వేం.) పేర్కొనబడినది. ఇందు తెలుగునాడు అని తెలుగుదేశముదాహృతమైనది. ఆనాటికే ఆంధ్ర, త్రిలింగ లేక తెలింగ పదములు ఒకటేజాతిని దేశమును తెలుపుటకు అభేదముగా వాడబడినవి. తెలుగును దేశపరముగాను, జాతిపరముగాను వాడిన శాసనము లింకను ఉండవచ్చును. కాని అవి యన్నియు క్రీ. శ. పదవ శతాబ్దమునకు తరువాతివేగాని అంతకు పూర్వపువికావు. పూర్వోక్తోదాహరణముల ననుసరించి చూడగా తెలుగు రూపమే - అది తెలుంగుకానీ, తెలింగకానీ - మొదటిది. పదునొకండవ శతాబ్ది మధ్యకాలమున పూర్వ చాళుక్య రాజరాజనరేంద్రుని ఆస్థానమున నుండిన నన్నయ భట్టారకుని నాటికి తెలుగు రూపాంతరముగా తెనుగు వచ్చినది. పదునాలుగవ శతాబ్దమునకు పూర్వమందుండి నన్నయ నన్నెచోడులు తెనుగును భాషాపరముగా వాడియున్నారు. పదమూడవ శతాబ్దములోని మహమ్మదీయ చరిత్రకారులు ఈదేశమును తిల్లింగ్ (తిలింగ) అని వ్యవహరించిరి. ఈవిధమున తిలింగ, తెలుంగు, తెలింగ పదములు దేశమును, భాషను, జాతిని సూచించు ఆంధ్రమునకు పర్యాయ పదములైనవి."

తెలుగు చాల ప్రాచీనమనుట కుదురదుగదా. టాలెమీ చెప్పిన 'త్రిలింగాన్' అనునది త్రిలింగమని చాలనుండి తలంచిరి. అది 'త్రిలింగాన్' కాదు 'ట్రిగ్లిప్టాన్' అనునది. ఆతని గందరగోళ భౌగోళిక రచనలో అది గంగకు తర్వాతిదిగా వర్ణింపబడి యున్నది. గంగను గౌతమ గంగగా - గోదావరిగా - గ్రహించినయెడల తర్వాతిది త్రికళింగమే. మఱికొందఱు 'తెలవాహ' నదిగలదనియు 'తెలాతట విషయము' తెలుగు దేశమనియు తలంచిరి. (సెరివాణిజ జాతకము. History of Orissa R. D. Banerji i, 216) కాని ఈనది ఆంధ్రదేశమందు గాక కోసలదేశమందు కలదని రాయచౌదరిగారి యభిప్రాయము. వారే తెలవాహనదిని కృష్ణానదికి ముడిపెట్ట ప్రయత్నించినది ముందే చూచి విమర్శించితిమిగదా. శ్రీ చౌదరిగారును మఱికొందఱును శక్తిసంగమతంత్రమును ఉదాహరించి దీని ప్రాచీనతను సాధింప జూచిరిగాని ఆతంత్ర గ్రంథము అర్వాచీనముగా తోచుచున్నది. ప్రామాణికముగాదు. త్రికళింగము త్రిలింగము కాలేదని స్పష్టము. చౌదరిగారును ఒప్పుకొనియున్నారు. త్రిలింగ మను రేఫయుక్త రూపము విద్యానాథుని ముందు కానరాదుగదా.

మఱియొక ప్రయోగము అడ్డు వచ్చునది కలదు. అది రాజశేఖరుని విద్ధసాలభంజికలో కలదు. "త్రిలింగాధిపతి" యని నాటక నాయకుని రెండుచోటులలో పేర్కొని యున్నాడు కవి. ఇది త్రికళింగాధిపతి యనుదానికి పొరపాటని నేను నా కేయూరబాహుచరిత్ర ముద్రణోపోద్ఘాతమున వివరించి యున్నాను. ఇట్లు చూడగా, తెలుగు జాతుల వారు, వారెవరోగాని, ఆంధ్రదేశము మీదికి కడప, నెల్లూరు, కర్నూలు, గుంటూరు మండలముల మీదుగా ఓరుగల్లు

వఱకు వ్యాపించినట్లు తెలియుచున్నది. శక్తిసంగమ తంత్రము ఎప్పటి రచనయోగాని దానిని శ్రీ రాయచౌదరిగా రుదాహరించుటలో ఒక రహస్యము వెలువడుచున్నది. "The Saktisangama Tantra (a medieval work) applies the name Andhradesa to the country which stretches from Jagannath (Puri) to the shrine of Bhramarambika" అని ఉదాహరించినారు గాని దీనిమీద వ్యాఖ్య వ్రాయుటలో పొరపాటు చేసినారు. "The last mentined spot reminds one of the 'Po-lo-mo-lo-ki-li' (Bhramaragiri) of the Chinese pilgrim and the Bhramarakotya man-dala in the Bastar state." ఆంధ్రదేశము పూరీ జగన్నాధము నుండి బస్తరుతో ఆగిపోయిన ఇక మిగిలిన దేశము గతియేమి? తప్పు. శ్రీశైలభ్రమరాంభయని ఏ తెలుగువానికైనను వెంటనే తోచును. దీనికి తగినట్లు వీరే తైలింగదేశపు ఎల్లలను చెప్పునపుడు వ్రాసినది చక్కగా గ్రహించి యుండినయెడల ఈ పొరపాటు చేసియుండరు. "The Saktisangama Tantra draws a distintion between the Andhra Country and another land which it calls Tailanga desa. The last mentioned territory is placed between Srisai-lam and the Chola country. But the distinc-tion is not always maintained." ఇందువలన స్పష్టపడునది ఇది - శ్రీశైలభ్రమరాంబ దేవాలయమువఱకు ఆంధ్రదేశము, అక్కడినుండి తమిళనాడువఱకు తెలుగు దేశము. అనగా కృష్ణకు దక్షిణమంతయు. మఱి యిది, దీని ప్రకారము, తెలుగు దేశముగాని త్రిలింగదేశముకాదు. ఇందు మూడు లింగములలో నొకటైన దాక్షారామము చేరదు. ఇది నా సిద్ధాంతమునకు చాల అనుకూలము. కృష్ణకు దక్షిణమున మూడు లింగములతో సంబంధము లేని దేశము తెలుగు దేశము. మూడు కొండలును (త్రినగములు - తెనుగు) లేవు. వేంగి చేరలేదేమో. వేంగి చేరియుండిన దాక్షారామము చేరియుండదా. మూడు కొండలనుటకు మహేంద్రపర్వతము చాల దూరమందున్నది. శ్రీశైల కాళహస్తులు మాత్రమే కలవు. శక్తి సంగమ రచననాటికి చోళరాజు లున్నట్లే. మఱి కాకతీయులింకను వేంగ్యాదులను జయించినట్లుగాని స్వాతంత్ర్యము వహించినట్లుగాని కానరాదు. నన్నయనాటికి (క్రీ. శ. 1051 - 61) వారింకను అనుమకొండను సంపాదించినట్లే లేదు. అది 1068 నాటికి.

మఱియొక విషయము - శాసనములలో తెలుగని యుండగా తెలుగుకవులు తెనుగని వాడుటకును ఏదోకారణ ముండియుండవలెను. వెలనాటి దుర్జయులు తమ 12 వ శతాబ్ది శాసనములలో (1100 - 1200) నిట్లు వ్రాసికొని యున్నారు.

'పూర్వాంభోనిధి కాళహస్తి శిఖర శ్రీమన్మహేంద్రాచల
శ్రీశైలైర్వ్యలయీకృతాంధ్ర విషయం'

ఇది చూడగా నాటికి ఆంధ్ర తెలుంగు లొకటైనట్లున్నారు గాని తెలంగాణమును కలుపుకొన్నట్లు కానరాదు. మంతెన కాళేశ్వర మిందు చేరలేదు. దాక్షారామమున కొండలేదు, మహేంద్రమున లింగము లేదు. నన్నయకు ముందే వేంగీ చాళుక్యులు కళింగము వఱకును జయించి పాలించుచుండి నందువలన వేంగీ చాళుక్యుల ఎల్లలుగా నివి నాటికి కుదిరి నట్లున్నవి. తెలుగునకు తెనుగు వ్యవహారమున వచ్చి, తర్వాత త్రినగముల భావము ఏర్పడినది. ఆవెనుకనే త్రిలింగముల భావము వచ్చినట్లున్నది. పాల్కురికి సోమ నాథుడు ప్రతాపరుద్రుని కాలమున బసవపురాణమును వ్రాసినవాడు తెలుగు బొమ్మయ్య కథను వ్రాసియున్నాడు. ఫలితార్థము తెలుగు చోళులు, వెలనాటి దుర్జయులు, తెలుగువారు. వారు పాలించిన దేశమే మొదట తెలుగుదేశము.

ఇది తెలుగువారి స్వవిషయగాన ఇంత వివరముగా వ్రాయవలెనని తోచినది. ఇంత చారిత్రావలోకనము వలన స్పష్టపడు విషయ మేమనగా, మన పదజాలముల చరిత్ర చాలపెద్దది, జాగ్రత్తగా పరిశీలింపవలసినది అని. భారతదేశమందు వైదిక వాఙ్మయ యుగము తర్వాత సంస్కృత యుగమునకు నడుమ ప్రాకృత వాఙ్మయ ద్రావిడ వాఙ్మయ

యుగములు ఇంచుమించు సమకాలికములుగానో, కొంత ముందు వెనుకలుగానో, ఉండి ఆసేతు హిమాచలము జనులు తమతమ ప్రాంతీయములను మాటలాడుచుండి, వీని యన్నింటి నుండియు సంస్కృత మను - చక్కగా సంస్కరింపబడిన - క్రొత్తభాష పుట్టి పాణిన్యాదులచేత ఆదరింపబడి దేశమందు వ్యవహార భాషగా నేర్పడినట్లు తెలియుచున్నది. కాబట్టియే ప్రాకృత తమిళ వాఙ్మయములకు తర్వాతనే సంస్కృత వాఙ్మయము కనబడుచున్నది. సంస్కృతమునకు ఈ పేరును పాణిని వాడలేదు. ఆతని వ్యాకరణమునకు భాషా వ్యాకరణము లేక అష్టాధ్యాయి యనియే పేరుగాని సంస్కృత భాషా వ్యాకరణమని లేదు. సంస్కృత మను పేరు ఆయన కాలమున లేదేమో! పైగా నీతడు సంస్కృత వ్యాకరణ కర్తలలో మొదటివాడు కాడు, ఆఱవవాడు :—

"ఇంద్రశ్చంద్రః కాశకృత్స్నా
ఆపిశలీశాకటాయనః
పాణి న్యమర జైనేంద్రాః
జయన్తి అష్టాది శాబ్దికాః".

తొలిమారు సంస్కృత శబ్దము వాల్మీకి రామాయణమున కలదు. తమిళ తొల్కాప్పియము, ఐంద్ర వ్యాకరణము ననుసరించినదని చెప్పుదురు. ఈ యైంద్ర వ్యాకరణము పోయినది. తమిళ వ్యాకరణమున దాని రూప మూహించుకొనవలసినదే. తొలి తొలి సంస్కృత వ్యాకర్తలు జైనులు. పాణిని బ్రాహ్మణుడును శైవుడును. ఒక్క బ్రాహ్మణులే గాక జైనాద్యన్యమతాలవారు కూడ సంస్కృతము నాదరించి రచనలు చేయుటచేత భారతదేశమందు ఎల్లవారును, తమిళులతో సహా, ఉమ్మడి భాషగా దీనిని ఆసేతు హిమాచలము పెంపొందించిరనియు, ఇది బ్రాహ్మణుల కాణాచి కాదనియు తెలియుచున్నది. మత విషయములను కావ్యములను మాత్రమేగాక సకల శాస్త్రములును, సకల లౌకిక విషయములును సంస్కృతమందే వ్రాయబడినవి. వైద్యము, గణితము, జ్యోతిషము, కామశాస్త్రము, వాస్తుశాస్త్రము, ఇట్లు పండితులకును పామరులకును పనికివచ్చు సకల విషయములును సంస్కృతమందే వ్రాయబడినది చూడగా నిది ఎంత సార్వజనీనతనందినదో విశదమగును. అందుచేతనే ఈ భాషకు మొదట ఒకపేరు లేదు. ఇది ఒక జనులది కాదు, ఒకదేశముది కాదు. మఱియొక రహస్యము దీనికి సొంత లిపికూడ లేదు. ఎవరెవరిలిపిలో వారు వారు వ్రాసికొను చుండిరి. (చూ. ఇందే చివర లిపిని గుఱించి).

## మన భారతీయ లిపులు

మన భారతీయ లిపులను గుఱించి రెండుమాటలు చెప్పుట అప్రసక్తముగాదు. వీనిని భిన్న లిపు లనుటకన్న ఇవి ఒక్కలిపికే వ్రాతభేదము లనుట మంచిది. ప్రస్తుతము మన లిపులన్నిటికిని మూలము అశోకుని శాసనలిపి. తెలుగు లిపికికూడ. మొహెంజోదారో - హరప్పాల సింధు లిపి ఇంతవఱకు అర్థముకాలేదు. దానిని వదలినయెడల బ్రాహ్మీ ఖరోష్ఠీ లిపులే అత్యంత ప్రాచీన లిపులు, ఖరోష్ఠి పశ్చిమ హిందూదేశమున మాత్రమే యుండినది, కుడి నుండి ఎడమకు వ్రాయబడెడిది. బ్రాహ్మి ఎడమవైపునుండి కుడికి. క్రమముగా ఖరోష్ఠి అంతరించి బ్రాహ్మి దేశమందంతయు వ్యాపించి బహువిధ పరిణామములను పొందసాగినది. నేటి భారతీయ లిపులన్నియు దేవనాగరముతో కూడ మౌర్యులనాటి బ్రాహ్మీలిపినుండి పుట్టినవే. ఇవియేగాక మనచుట్టు నుండు టిబెత్తు, బర్మా, సింహళము, జావా, సుమత్రా మొదలైన దేశాల లిపులుకూడ దీనినుండి పుట్టినవే.

అశోక లిపినుండి ఉత్తరదేశమున మొదటి పరిణామము గుహ లిపి. క్రీ. శ. నాలుగవ శతాబ్దము నుండి మార్పు. ఇది ఉత్తరమున నాగరి లిపికిని. దక్షిణమున దాక్షిణాత్య లిపులకును ప్రారంభకాలము. దక్షిణాపథమందలి తెలుగు కన్నడ లిపులయొక్క ఆర్షస్వరూపము, కొద్దిపాటి ప్రాంతీయ భేదములతో నేర్పడి ప్రాచీన పల్లవ,

వేంగి చాళుక్య, పశ్చిమగాంగ, కదంబ, బాదామి చాళుక్య శాసనములలో కనబడుచున్నది. దీనికే ఆంగ్లేయ పండితులు వేంగి లిపియని పేరుపెట్టిరి. ఈకాలపు లిపియే ఇండో చీనా మలేషియాలకు పోయినది. కళింగమునందు మొదట ఈలిపియే యుండినదిగాని క్రమముగా అదిపోయి అచ్చట నాగరిలిపి ప్రవేశించినది.

క్రీ. శ. 660 నాటికి పల్లవుల కాలమున తమిళనాడులో నుండినది ఈ వేంగి లిపియే. ఇదియే తెలుగు కన్నడముల ప్రాచీన లిపి. క్రీ. పూ. తమిళనాడులో నుండినది భట్టిప్రోలు లిపిని పోలిన బ్రాహ్మీలిపి. ఇది మధుర, రామనాధపురం, తిరునెల్వేలి, తిరుచినాపల్లి మున్నగు ప్రదేశములలో దొరకినది. తరువాత కొంత కాలమువఱకు కూడ తమిళములో శాసనములు లేకుండి (దొరకలేదు) పల్లవుల కాలము నుండియు కనబడసాగినవి. ఈ పల్లవుల కాలముననే పల్లవగ్రంథ మనబడు గ్రంథలిపి ఏర్పడినది. సంస్కృతమును వ్రాయుటకు తమిళదేశమున దీనిని వాడుదురు. తెలుగులోవలె ఇందు గుణింతము, ఒత్తులు, అనుస్వారము కలవు. కొన్ని అక్షరములు తమిళముకన్న భిన్నములు. ఇప్పటికిని మన సంస్కృత పండితులకు తెలుగులిపి తప్ప సంస్కృత నాగరి లిపి రానట్లే, తమిళదేశమందలి పురోహితులకును సంస్కృత పండితులకు గ్రంథలిపియేగాని నాగరిలిపి రాదు. ఇందువలన ప్రాచీన తమిళలిపియు, వేంగి లిపియు ఒక్క పరిణామమునకు చెందినవని తెలియుచున్నది.

తెలుగు కన్నడ లిపులు పదవ శతాబ్దము నాటికి కొద్దిగా మార్పును పొందసాగినవి. పదునాల్గవ శతాబ్దము నాటికి చాల మార్పు వచ్చినది. తలకట్టులు చాల మారినవి. పదునైదు పదునాఱు శతాబ్దములకు ఎక్కువ ప్రత్యేకత సిద్ధించినది. కాని ముద్రణము వచ్చినది మొదలు పూర్తి ప్రత్యేకత వచ్చినది. ఐనను ఇంకను చాల పోలికలు నిలిచియున్నవి.

తమిళ గ్రంథలిపినుండు మళయాళ లిపి పరిణామమందినది. వారికి సంస్కృత మెక్కువ, అందువలన ఒత్తులు పోలేదు. ఇందులో తలకట్టులు అక్షరములతో కలసిపోయి, అవి చదరముగా కుదిరినవి. తమిళులు ఒత్తులను వ్రాయక అర్ధాక్షరములను ముందుగా ప్రక్కన వ్రాయుటయు, పెక్కు సంస్కృ తాక్షరములను అక్కఱ లేదని వదలి ழ వంటివానిని కల్పించుకొనుటయు జరిగినది. ఈ పరిణామములను అర్థము చేసికొన్నయెడల మనకందఱకును ఏకైక లిపిని నిర్మించుకొనుట కష్టముకాదు.

## అక్షరములు

### సంస్కృతమునకు వర్ణములు ఏబది (50)

అచ్చులు — 14. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ.

హల్లులు — 34. క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ శ ష స హ ళ.

ఉభయాక్షరములు — 2. ం, ః.

కొందఱు "ౡ, ళ"లను వదలి 48 అక్షరములందురు.

### ప్రాకృతభాషకు వర్ణములు 40

అచ్చులు — 10. అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఐ ఓ ఔ.

హల్లులు — 30. క ఖ గ ఘ, చ ఛ జ ఝ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ స హ ళ.

కొందఱు హ్రస్వ "ఎ ఒ"లు కలవందురు. కొందఱు హ్రస్వ "ఎ ఒ"లును "ఐ ఔ"లును లేవందురు.

ఇందు లేనివి — ఋ ౠ, ఌ ౡ, ఙ, ఞ, శ, ష.

ప్రాకృతభాషలు— మహారాష్ట్రి, ప్రాకృతము, శౌరసేని, మాగధి, పైశాచి, చూళిక. అపభ్రంశములు.

## ఆంధ్రభాషకు వర్ణములు 56

అచ్చులు — 16. అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ.

హల్లులు — 37. క ఖ గ ఘ ఙ, చ ౘ ఛ జ ౙ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ శ ష స హ ళ ఱ.

ఉభయాక్షరములు — 3. ం, ఁ, ః.

కొందఱు "ౡ, ళ"లను వదలి 54 అక్షరములందురు.

## కన్నడభాషకు వర్ణములు 54

అచ్చులు — 16. తెలుగువలెనే.

హల్లులు — 37. 'ౘ ౙ'లు లేవు. 'ఱ' తమిళ 'ழ' వంటిదియు, రెండువిధములైన 'ళ'కారములును గలవు.

ఉభయాక్షరములు — 2. ం, ః.

## అచ్చతెనుగునకు వర్ణములు 37

అనగా సంస్కృతమందలి ఋ ౠ ఌ ౡ, ః ఖ ఛ ఠ థ ఫ, ఘ ఝ ఢ ధ భ, ఙ ఞ శ ష సలు లేవు.

ఇట్లే అచ్చగన్నడమునను.

## తమిళమునకు వర్ణములు 31

అచ్చులు — 12. అ ఆ ఇ ఈ ఉ ఊ; ఎ ఏ ఐ, ఒ ఓ ఔ.

హల్లులు — 18. క ఙ, చ ఞ, డ (ట) ణ, త న, ప మ, య ర ల వ ழ ళ (ன) న.

ఉభయాక్షరములకు బదులు — .·. అను గుర్తు అహ్, అక్ అను ధ్వనిగలది కలదు. నేడు దీనిని F స్థానమున వాడుచున్నారు.

## తమిళ పదోచ్చారణ

(Dr. Ilakkuvanar అనువారి తొల్కాప్పియం ఆంగ్లానువాదము నుండి)

క க *h* హవలె అహం - అకం అనరాదు.
*k* కవలె పక్కం - పగ్గం ,,
*g* అనునాసికము ముందు గవలె పఙ్గు - పంగు, పంకుకాదు.
ఙ ங *ṅ* 'లాంగ్' Longలోవలె, రంగ, తంగ
చ ச *s* కశివు, పాశి (పాచి)
*c* చోరు (శోర్రు = అన్నము) అచ్చం
*j* గంజి, కంజి (కంజీవరము - కంచీవరము అనరు)
ఞ ஞ *ñ* 'స్పాంజ్'వలె, రంజన - రఞ్జన
డ(ట) ட *ṭ* కట్టి, కట్టు
*ḍ* వండి = బండి, వంటి అనరాదు. ఇడం = చోటు. ఇటం అనరాదు.
ణ ண *ṇ* కరుణ
న *ṉ* దంత్యనకారము
ప ப *p* పాట్టు = పాట. ఉప్పు.
*b* వంబు - వంపు అనరాదు.
మ య ర ల వ లు వ్రాసినట్లే యుచ్చరింపదగును.
ఱ ற ఇదే ద్విత్వమైన ట్ర గా నుచ్చరింపవలెను. కుఱ్ఱం - కుట్రం
ழ దీని యుచ్చారణవిని గ్రహింపవలసినదే. వాழప్పழం = అరటిపండు. వాళప్పళం అని సామాన్యముగా అందురుగాని సరికాదు.

ఫ్రెంచి భాషలోవలె తమిళములో ఉచ్చారణ విచిత్రముగా నుండును. అది విని గ్రహింపవలసినదే.

ఇది పరిమిత త్రైభాషిక నిఘంటువే యైనను, ఇంత దీర్ఘమైన పీఠిక అక్కరలేకపోయినను, భాషా చారిత్రక జిజ్ఞాసువులకొఱకు వ్రాసితిని. ఈ కాలమున భాషా ప్రయుక్త రాష్ట్రములవలన ప్రాంతీయాభిమానములు బలపడినవి గాని దురభిమాన రూపముల తాల్చుచుండుటచేత చారిత్రక జ్ఞాన మావశ్యకమగు చున్నది. ఈ దేశవిభాగములు పరిపాలన సౌకర్యార్థము చేయబడినవి. వాస్తవముగా మన మందఱము భారతీయులమే. ఇందులకే లిపి చరిత్రతో కూడ మన భాషల పుట్టు పూర్వోత్తరములను వివరముగా తెలిపితిని. ఇంకను ఎక్కువగా తెలిసికొనగోరువారు ఆయా గ్రంథములను చూతురుగాక. మనమందఱి యాశయమును

'ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబకమ్'

అనుటయేగదా. మన ప్రాచీన శాబ్దికులు 'ఏకః శబ్దః సుప్రయుక్తః సమ్యగ్జ్ఞాతః స్వర్గేలోకే కామధుగ్భవతి' అన్నారు. ఒక్క శబ్దమే చక్కగా గ్రహింపబడిన కామధేనువవలె అగునేని శబ్దజాలమంతయు చక్కగా గ్రహించిన చెప్పవలయునా! ఈ విషయమున English Tamil Etymological Dictionary లో సుప్రసిద్ధ నిఘంటు రచయితలు శ్రీ శంకరనారాయణగారు 1911లో ఉపోద్ఘాతమున వ్రాసినది స్మరింపదగినది. —

"The student will best enquire and dive into the derivation of a word only after acquainting himself with and mastering tolerably well, its current living forces. The origin of a word and the development or progress of its sense or signification must in all cases be of great historical value. A knowledge of them, further, must assist the memory and improve, strengthen and render precise the grasp of its present force. It decidedly widens the student's understanding and beautifully enlarges his outlook on the language. A knowledge of the origin and composition of words often enables one to understand even a new word through his previous acquaintance in the case of other words, with the elements of which it is composed. It further serves a still higher purpose, I conceive, in keeping a language itself in its right orthodox lines, by preventing writers and speakers, young or old from moving off their road and rails in the employment and usage of their vocables."

"The branch of comparative philology relating to the derivation of etymology of words is said to be not yet in a satisfactory state of advancement and it is perhaps feared that it can never be completely so. So much of it at present is of an unknown, doubtful and conjectural nature. Again all that is given as roots does not exactly imply anything like the fact that one language is come from another or that it is chronologically later or junior. Such we believe, connot be the influence, but all that can be thought is only that they are cognate and may have some common origin or source."

ఈవిధముగా శబ్ద సామ్య భాషా సామ్యాదులచేత ఐకమత్యము కలుగుట ఎంతయు వాంఛనీయము.

ఈ నిఘంటు నిర్మాణమందు మేము మాకు సాధ్యమైనంత కృషి సల్పినాము. ఇది ఒకరిచేత సాధ్యమగునది కాదనుట విశదమే. ఎందఱో పండితులు కలసి చేయవలసినట్టి కార్యమును మేము మువ్వురము మాత్రమే చేయుటవలన లోపము లుండవచ్చును. అది సహజము. సహృదయుల సలహాల ననుసరించి ముమ్ముందు ముద్రణములలో అకాడమీ వారి యనుగ్రహమున దీనిని ఇంకను సహాయకారిగా పెంపొందింపగలమని విశ్వసించుచున్నాము.

ఈ మహత్కార్యమును చేయించిన సాహిత్య బంధువులు, అకాడమీ అధ్యక్షులు డా. బెజవాడ గోపాల రెడ్డిగారికిని, అకాడమీవారికిని, మాతో పదేపదే సంప్రదించుచు ఈ కార్యనిర్వహణ కాలమందు మాకు ప్రోత్సాహమిచ్చి పలువిధముల తోడ్పడిన అకాడమీ కార్యదర్శులు, కార్యదక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికిని మా నిండు కృతజ్ఞలు.

10 - 1 - 1978
మదరాసు

వేదము వేంకటరాయశాస్త్రి
(సంపాదకవర్గ సమాశేకర్త)

శ్రీ

# ఆంధ్ర తమిళ కన్నడ నిఘంటువు



| తెలుగు | తమిళము | కన్నడము |
| --- | --- | --- |
| అ. మొదటి అక్షరము. (దే.) అవధారణమును తెలుపును, (సం.) అభావ నిషేధములను తెలుపును. | ముదల్ ఎళుత్తు. అవ్విడం, అజ్ఞానం, (బహువచన ప్రత్యయము), వందనె (వచ్చినవి, వచ్చినారు.) ఎనిమిది యను అంకె. | మొదలనెయ అక్షర, ఆదరణార్థక. నిషేధ స్వరూపవన్ను, అథవా అభావవన్ను సూచిసువదు. |
| అంక (దే.) పార్శ్వము, ప్రక్క. | అక్కం పక్కమ్. | పక్క, కడె, తోడె. |
| అంకణము. నలుచదరపు చోటు, కక్ష్య, ఒకపాటి ఇంటి యడుగుల కొలత, లోగిలి. | ముట్రం, మనైగళై అళక్కుం అళవు, కొట్టడి, జలదారై. | మనెగళమధ్యదల్లిరువస్థళ అంగళ, చచ్చౌకస్థల, ప్రామాణిక, కంబగళ మధ్యదసందు, కొట్టడిగళల్లిరువ స్థళదలెక్క. |
| అంకగణితము. మధ్యము-శ్రేణి. | కణక్కు, ఎణ్ కణక్కు. | అంకగణిత లెక్క, సంఖ్యా విద్యె, అంకెగళ నడువె, అంకెగళ పంక్తి బెలెకట్టు, లెక్కహాకు. |
| అంకపాళి. అంకపాళిక, ఆలింగనము. (కౌగిలి.) | తిణ్ణై, (తిన్నె) తళువల్, దాది. | ఆలింగన, తబ్బికొళ్ళువదు, అప్పుగె. అంకపాళి. |
| అంకపొంకములు. | కోపం, పగైమై. | భీషణ, హోర, వగ. |
| అంకము, ఆక్షేపము. తగవు, గుర్తు. | ఆక్షేబం, శండై, అడైయాళం. | అడ్డి, ఆక్షేపణె, జగడ, చిహ్న. |
| అంకె, లెక్క, గుఱుతు, చోటు, సంఖ్య, తప్పు, నాటకవిభాగము, భూషణము, యుద్ధము, సమీపము, ఒడి, తొడ. | అడయాళం, కణక్కు, పతి, ఇడం, నాటకత్తిన్ ఒరుపిరివు, అణి, పోర్, అరుగామై, మడి. | లెక్క, గుర్తు, స్థళ, జాగ, తప్పు, నాటకద విభాగ, ఒడవె, కాళగ, సమీప, తొడె, మడిలు, ఉడి. |
| అంకమ్మ. ఒక గ్రామదేవత. | అంగాళమ్మ, కాళి, నాట్టిన్ పురం కాక్కుం దేవదై, అంగాళి. | అంకాళమ్మ గ్రామదేవత. |
| అంకవన్నె. మేలిరంగు, గుజ్జమురికాబు. | ఎడుత్తుకాట్టుం చాయల్. | ఎత్తికొడువబణ్ణ. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
| --- | --- | --- |
| అంకవిద్య. చూ. (అంక గణిత శాస్త్రము). | ఎణ్ కణక్కు శాస్తిరం, ఎణ్ కణక్కియల్. | సాధారణవాద లెక్క, గణిత, లెక్క తనిఖీమాడు, విమర్శె. |
| అంకాపాంకములు. కోపము, విరోధము, ఉగ్రము. | కోవం, సినం, పగైమై. | భీషణ, విరోధ, కత్తు, |
| అంకించు, లంకించు, స్తుతించు, సంతోషించు, పైకెత్తు, ఆడించు, జళిపించు, పట్టుకొను. | పుగళుదల్, తుదిత్తల్, బయమురుత్తుదల్, పిడిత్తుక్కొళ్. | హొగళ్లు, ప్రశంసిసు, మేలక్కె ఎత్తు, హిడిదుకొళ్లు, ఆడిసు ఝళిపిసు. |
| అంకిణి. గుఱపు జీనునకు అలంకారము. | కుదిరైయిన్ జీనుక్కు శెయ్యుం అలంగారమ్. | జీనిన అలంగార, తడియబడవె. |
| అంకితము. గుఱుతువేయబడినది, ఎంచబడినది, కృతి సమర్పణము. | ఉడమైయాక్కుదల్. పాట్టు ఉడయవన్. (ఒరు శెయ్యుళ్ తొగుప్పిర్కు ఉరిమైయాళన్, సమర్పణం). | అంకిత, చిహ్న, ఎణికె, కృతిసమర్పణె. |
| అంకియ: చూ. అంకె. సంఖ్య. | ఎణ్. | సంఖ్య, లెక్క. |
| అంకియము. ఎద్దుమీది ఒకవైపు గోనె (అంకెము). | ఎరుదుమాట్టిన్ ఒరుపురమ్ వైత్తకోణి. | ఎత్తినమేలే హాకిదగోణీ, చీలహాత్తిగె. |
| అంకిలి. అడ్డము, ఆపద, క్షోభము, కలప, అంకిలిపెట్టు, అడ్డగించు. | తుయరమ్. తడుత్తుదల్. | అడ్డి, కష్టి, అడ్డిమాడు, అడ్డిగట్టు. |
| అంకిలిపడు, అడ్డుపడు. | తడుప్పదు. | అడ్డిగట్టు. |
| అంకిళ్లు. దవుడక్రిందనుండు కీళ్లు. | తాడయిన్ కీళేయిరుక్కుమ్ కీల్‌గళ్. | దవడె కెళగె ఇరువ కీలుగళు. |
| అంకుటము. కుంచ, కోల. | పిడి. | కుంబిగెయ హిడికె, కావు. |
| అంకుఁడు. కీర్తిపొందినవాఁడు. | పుగళ్ పెట్రవన్. | కీర్తిపడెదవను, ముఖండ. |
| అంకురనిరోధము. బీజమును చంపుట. | ముళైయై వెట్టుదల్. | వంశబెళెయదమాఁడు. |
| అంకురము. అంకూరము, మొలక, చిగురు, బీజము, నీళ్లు, నెత్తురు, వెంద్రుక, పిండము, భ్రూణము, (Embryo). | అంగురం, ముళై, కప్పె పేని, అంకూరమ్, తళిర్, పిండం, గర్భకరువి. | మొళకె, చిరుగు బీజ, నీరు, రక్త, కూదలు, భ్రూణ, గర్భపిండ. |
| అంకురించు. మొలకెత్తు, చిగుర్చు. | అంకురిత్తల్, ముళైత్తల్. | చిగురిసు, మొళకెయాగు. |
| అంకురోత్పత్తి. బీజోత్పత్తి, బీజము మొలకెత్తుట. | ముళైత్తల్. ముళై ఎడుత్తల్. | బీజదింద, మొళకెబరువుదు. |
| అంకుశము. ఏనుఁగును నడుపుటకు పొడుచు ఆయుధము. | అంకుశమ్. యానైప్పాగన్ యానైయై ఓట్టుం కూలంపోన్ర ఆయుదం. | అంకుశ. ఆనెగెచుచ్చుగోలు, |
| అంకుశన్యాయ. పెద్దయేనుగు చిన్నయంకుశమునకు వశమగునట్లు. | మిగప్పెరియయానై శిరియకూల త్తిరుక్కు కట్టుప్పట్టిరుప్పదు. | అంకుశన్యాయ ఆనెయాదరూ అంకుశక్కె హెదురువుదు. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
|---|---|---|
| అంకె. ప్రసిద్ధి, సంఖ్య. | పిరబలమ్. పుగళ్, ఎణ్. | కీర్తి, సంఖ్యె, ఎణ్ణికె. |
| అంకోలము. ఊడుగుచెట్టు, రూ. అంకోటము, అంకోరము. | ఒరువిదమానమరం, అంగోలమరం. | ఒందు వృక్షవిశేష. |
| అంకోలబీజన్యాయము. అంకోల బీజమును దాని తైలమందె నానినపిదప నాటిన తత్క్షణమే మొలచునట్లు, శీఘ్రవృద్ధి. | అంకోలమరత్తిన్ విదైయై అదన్ ఎణ్ణెయిల్ ఊఱినపిన్బు నట్టాల్ ఉడనే ముళైక్కుం మాదిరి; శీక్కిరం వళరువదు. | అంకోలన్యాయ, అంకోలబీజవన్ను అదర తైలదల్లి నెనదిట్టు భూమియొళగె ఇట్టిద తక్షణవె మొళకె బరువుదు, శీఘ్రవృద్ధి. |
| అంగ. కాలుచాచిన అడుగు. | నీణ్డ అడి. | చాచిద, నీటిదకాలు, హెజ్జె. |
| అంగడి. దుకాణము. | అంగాడి, కడై. | అంగడి, సభె, కట్టె. |
| అంగడివీధి. బజారు, రచ్చ, సభ. | కడైతెరువు. | బజారు. |
| అంగణము. ప్రాంగణము, ముంగిలి. | ముట్రమ్, వెణ్గారం. | అంగళ, అంగణ. |
| అంగద. ఆకలి, ఆపద. | పసి, ఆపత్తు, తున్బం. | హసివు, కష్ట. |
| అంగదము, బాహుపురి, | తోళ్ అణి. | తోళిగె ఆభరణ. |
| అంగదట్టము. పావడ | పావాడై. | పావడె, లంగ. |
| అంగన. స్త్రీ, ఆడుదిగ్గజము. | పెణ్, మంగై, ఒరుదిక్కైయిన్ పెణ్ యానై. | హెణ్ణు, స్త్రీ, దిగ్గజ. |
| అంగన్యాసము. హృదయమందలి భాగములను మంత్ర పూర్వకముగా తాకట. | అంగనియాసమ్, ఇరుదయం ముదలియ ఉరుప్పుగళై మందిరత్తోడు కైయాల్ తొడుదల్. | అంగన్యాస, (మంత్రశాస్త్రద మాతు). |
| అంగప్రదక్షిణము. గుడిలోపెట్టు ప్రదక్షిణపు పొర్లు దండము. | అంగప్పిరదక్షిణమ్. దేహత్తాల్ పురండు వలమాగ వరువదు. | ప్రదక్షిణమాడు. (తన్న సుత్తుతానే) గుడిసెలద మేలె హొరళాడు. |
| అంగబిల్ల. | అరశయిలై బిల్లై. | మానదబిల్లె. |
| అంగమచ్చము. గులుతు, జాడ. | కుఱి, ఉడలిల్ మచ్చం. | గుర్తు, హాది, పత్తె. |
| అంగమర్దుడు. కాళ్లు చేతులు పిసుకువాఁడు. | కాల్కైగళై పిడిప్పోన్. | కైకాలిన మాలిశ్గార, ఒత్తడ హాకువను. |
| అంగము. అందము, విధము, అవయవము. దేహము, ఒకదేశము, భాగము. | అంగం, అవయవమ్, ఉడల్ అడైయాళమ్, ఒరునాడు, పిటివు, కట్టిల్. | శింగార, చెలువె, అంగరాజ్య, విభాగ శరీర, కైకాలు. |
| అంగమొల. దిసమొల, గుడ్డలేని దశ. | అమణం, అమ్మణం. | నగ్న, బత్తలు, దిగంబర. |
| అంగమొలవేల్పు. శివుడు దిగంబరుడు, బుద్ధుడు. | అంగణన్, పరమశివన్, బుద్ధన్. | శివను, (ఈశ్వర) బుద్ధ (విష్ణువు.) |
| అంగరంగవైభవములు. అభ్యంతర, బాహ్య (సమస్త) వైభవములు. | అంగరంగవైబవమ్, ఎల్లా వైబవమ్గళుం. | సకలవిధవాదవైభవ, అంగరంగవైభవ. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
|---|---|---|
| అంగరక్ష. దేహరక్షణ, కవచము. | ఉడల్ పాదుకాప్పు, కవచం మెయ్ కాప్పు. | అంగరక్షె, కవచ, జగర, జోడు. |
| అంగరక్షకులు. శరీరరక్షకులు. | మెయికాప్పాళర్ గళ్. | అంగరక్షకరు. |
| అంగరాగము. శరీరమునకు గంధాదుల పూత, విలేపనము. | ఉడంబిర్కు తడవుమ్ చందనం ముదలియవైగళిన్ పూచ్చు. | అంగరాగన విలేపన, ఉద్వర్త, తీవి పూసువదు; విలేపన. |
| అంగరుహము. వెండ్రుక. | మయిర్. | రోమ. |
| అంగవస్త్రము. పైపంచె, ఉత్తరీయము. | అంగవస్తిరం, మేల్ వేష్టి, తుండు. | అంగవస్త్ర, అంగోస్త్ర, ఉత్తరీయ. |
| అంగలార్పు. దుఃఖము, గట్టిగా ఏడ్చుట. | వరుత్తం, శోకత్తినాల్ శత్తంపోట్టు అళువదు. | అంగలాచిను, అంగలాపు. |
| అంగవించు. ఉత్సహించు, అతిక్రమించు. | ఊక్కువిత్తల్. | అతిక్రమిసు, సేరు. |
| అంగహారము. నాట్యమందు అవయవముల కదలిక. | నాట్టియత్తిల్ అవయవంగళిన్ అశైవు. | నాట్యదల్లి, ఒందుతరద కోణత. |
| అంగహీనుఁడు,కుంటి,గ్రుడ్డి, కాలుచేయి లేనివాడు. | అంగమిల్లాదాన్, నొండి, కురుడన్, ముడవన్. | అంగవిల్లదవ, కురుడు, కుంటి. |
| అంగారకము. అంగారము, నిప్పు, బొగ్గు. | అంగారగన్, నెరుప్పు, కరి. | బెంకి, అంగార, ఇద్దలు, ఇంగళ. |
| అంగారకవారము. మంగళవారము. | సెవ్వాయ్ కిళమై. | మంగళవార. |
| అంగారకుఁడు. ఒక గ్రహము, కుజుడు. | శెవ్వాయ్ గిరగమ్, కుజన్. | ఒందు గ్రహ, కుజగ్రహ. |
| అంగారము. నిప్పు, బొగ్గు. | నెరుప్పు, కరి. | బెంకి, ఇద్దలు, ఇంగళ. |
| అంగి. చొక్కాయ, అంగములుకలది, ముఖ్యమైనది, ప్రధానము. | అంగి, శట్టై, అగ్గిని, నెరుప్పు, తీ. | అంగి, అంగవుళ్ళదు, ముఖ్యవాదదు. |
| అంగిక. చిన్న చొక్కాయ, రవిక. | రవిక్కై, చిఱుచొక్కాయి. | చిక్క అంగి, జాకెట్టు. |
| అంగిలి. లోపలికుత్తుక, కొండనాలుక పైభాగము, చిరునాలుక. | ఉళ్ తొండై, ఉళ్ నాక్కు. | కంఠదొళగె ఇరువ నాలగె. |
| అంగీ. పొడుగుచొక్కాయ. | కై నీండచొక్కాయి. | ఉద్దవాద అంగి, నిగళవాదకవచ. |
| అంగీకారము. సమ్మతము, ఒప్పుదల. | అంగీకరిత్తల్, ఏట్రుక్కొళ్ళుదల్, సమ్మదం. | ఒప్పిగె, సమ్మతి, అంగీకార. |
| అంగీకార్యము. ఒప్పుకొనదగినది. | ఏట్రుక్కొళ్ళత్తక్కదు. | అంగీకరణ యోగ్య. |
| అంగీకృతము. సమ్మతింపఁబడినది. | అంగీకరిక్కప్పట్టదు, ఒత్తుక్కొళ్ళప్పట్టదు. | ఒప్పిద మాతు. |
| అంగుటము. బొటనవ్రేలు, అంగుష్ఠము. | కట్టైవిరల్. | హెబెట్టు హెబ్బెరళు, అంగుష్ఠ. |
| అంగుళము. అంగుళిగ్రేలు బొటనవ్రేలు. | అంగులము, మోదిరమ్, ఒరుఅళవు, ఓర్ | బెరళు, బెరళిన అగల దష్టు అళతె. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
|---|---|---|
| కొలత, ఒక అడుగులో పంద్రెండవ భాగము. | అడియిల్ పన్నిరండాం పగుది. | అంగుల ఒందుపాదదల్లి హన్నెరడనెయభాగ. |
| అంగుళిత్రము. వస్త్రపు వాని వేలి తొడుగు. | అంగుష్టాన్, తైయల్ కారన్ విరలిల్ అణియుమ్ కూడు. | బెరళను కాయువ లోహద – అథవా చర్మదమరె. |
| అంగుళిముద్ర. ముద్దుటుంగరము. | మోదిరముద్దిరై, | అంగుళి ముద్రె, ముద్రాంగులీయక, |
| అంగుళీయకము. ఉంగరము. | మోదిరం. | అంగులీయక, ఉంగుట, ఉంగర, ఉంగ్ర. |
| అంగుష్ఠము. బొటనవేలు, ఉంగుటము. | అంగుట్టం, పెరువిరల్. | అంగుట, ఉంగుట, హెబ్బెరళు. |
| అంగూరు. ఒకరకపు ద్రాక్ష. | ఒరువగై దిరాక్షైప్పళం. | ద్రాక్షె, అంగూరు. |
| అంఘ్రి. పాదము. | అడి, కాల్, పాదం. | అడి, కాలు, పాద. |
| అంచన. కొలతవేయుట. | అళవుపోడుదల్, ఎడైపోడుదల్. | అళతె, అందాజు. |
| అంచ(చె). అంచియ ప్రయాణములో నిలుచుచోటు,దూరమునకు అందించుటకు జరుగుతీయుట, ఒకరికొకరు అందించుటపా. | పిరయాణత్తిల్ తంగుదల్, తపాల్ బట్టువాడా శెయ్య వేండి ఓడుం తపాల్ కారర్గళ్, ఒరువరుక్కొరువర్ మాత్తిక్కొళ్లువదు, అంజల్. | ముక్కామ మజలు, మజలిపట్టె. |
| అంచె, హంస. (అంచయాన, హంసవలె నడచు స్త్రీ). | అన్నం,(అన్నంపోల్ నడక్కుం పెణ్). (అన్నవడై). | అంచె, హంసె (హంసయానె,) |
| అంచలము. కొంగు. | ముందాణి. | సెఱగు. |
| అంచితము. తగినది, పూజింపఁబడినది. | తగుందదు, యోగ్యమానదు పూజైక్కు ఉరియమలర్. | పూజిసల్పట్ట, స్పష్ట, విశద. |
| అంచు. (అనుచు), చెప్పుచు, పంపుచు, పంపించు, తుద, బండికంటియాకు చివరిభాగము. | ఎన్ను,చొల్లిక్కొండు, అనుప్పిక్కొండు, అనుప్పు, కడైశి,- | హేళుత్త, కళుహిస్సు, కడ, అంచు, చక్రదకీలినకడె. హంచు. |
| అంజ. అడుగు. | అడి. | హెజ్జె. |
| అంజ. భయము. | అచ్చం. | భయ. |
| అంజక. భయపడక. | అంజేల్, బయమ్ ఇల్లాద. | భయవిల్లద. |
| అంజకాడు. అంజనము వేయు మాంత్రికుడు. | అంజనంపోడుం మాంద్రికన్. | అంజనహాకువ మాంత్రిక. |
| అంజనము. కాటుక, ఒక దిగ్గజము. | (కణ్ణిన్)మై, ఒరుదిక్కైయిన్ యానై. | అంజన, కాడిగె, ఒందుదిగ్గజ. |
| అంజనము వేయుట. వ్రేలిగోరుకు కాటుక పూసి దొంగతనము తెలిసికొనుట. | అంజనం పోడుదల్, నగత్తిలక్కు మైపూసి తిరుడు కండుప్పిడిత్తల్. | నిధి కళ్ళ తనగళ పత్తెమాడువుదక్కాగి ఉగిరిగె కప్పు ఇట్టు నోడువ తంత్ర. |
| అంజలి. చేమోడ్పు, దోసిలి (గీతాంజలి. పుష్పాంజలి ఇత్యాది), నమస్కారము. | అంజలి, వణక్కం, కైకూప్పుదల్. | అంజలి, కైముగియువుదు, నమస్కార. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
|---|---|---|
| అంజిక. భయము, చూ. అఁజు. | అంజు, బయప్పడుదల్. | అంజికె, భయ, అంజి. |
| అంట. అనుట, అంటుట, పట్టుడు ఆకు. | ఎన్రు, తోడుదల్, తైఱల్ ఇలై. | అన్నువుదు, హచ్చు, ఊటదఎలె, ప్రతాళి. |
| అంటగట్టు. చేర్చికట్టు, బిగించు, ఆపాదించు. | ఇరుక్కిక్కట్టు ఇళుత్తుక్కట్టు. | జోడిసికట్టు బిగిసు, నించెహాకు. |
| అంటబట్టు. గట్టిగా చేర్చిపట్టు, వదలక చేయు. | విడాముయర్చియుడన్ శెయ్వదు. | బిగియాగి కట్టు. |
| అంటలు గట్టి. గుంపులు గూడి. | గుంబల్ గూడి. | గుంపుగూడి. |
| అంటసిల్లు. దగ్గరచేరు, | శేరు, ఒన్రుగూడు. | సేరు. |
| అంటి. అరటి, అనటి, అంటిచెట్టు అంటాకు. | వాళై. వాళైమరం, వాళైయిలై. | బాళెవగిడ, బాళెఎలె. |
| అంటించు. అతికించు, చేర్చు. (తేలు కుట్టుట) | ఒట్టు, ఒన్రుశేరు, (శేర్క్క) జోడనై శెయి, (తేళ్ కగ్గైరా) కుట్టు, కడి. | సేరిసు, జోడిసు, అంటుహాకు, కడి, చుచ్చు, తేళుకడియు. |
| అంటు. చెట్లను అంటు త్రొక్కుట, తాకు, చేర్పు, స్నేహము, బంధుత్వము ముట్టు, తాకు, మైల, ఆశౌచము, (అంటరానితనము.) | ఒట్టుదల్, తొడు, నట్టు, తీట్టు, తీండామై. | ముట్టు (బహిష్టు), కసికట్టువుదు, సేరిసు, గెళెతన, మైలిగె, ఆశౌచ, అంటిక్కు, అస్పృశ్యతె. |
| అంటుకత్తె. ఉంపుడు గత్తె, ప్రియురాలు. | కాదలి, విలైమాదు, వేశియై. | ఒడతి, కాంతె, (వారకాంతె.) |
| అంటుకాడు. భర్తకాని ప్రియుఁడు. | ఆశై నాయగన్. | మిండ, జారపతి. |
| అంటుకొను. నిప్పురగులు కొను, పట్టుకొను, | నెరుప్పు పట్రికొళ్ళుదల్, పిడిత్తుక్కొళ్. | సీయు, కెండ, ఆగువుదు. |
| అంటుగట్టుట. చెట్లను అంటుత్రొక్కించుట. | చెడిగళై పదివువైక్కుదల్, పదివు. | కలము మాడువ, రెంబె, అంటు, హూాతు సస్య వృద్ధిమాడు, అంటిక్కు. |
| అంటుజోడు. చెవిపోగులు, కర్ణాభరణము. | కాదణి. | ముదువు, కర్ణ కుండల. |
| అంటుతాయి. సూదంటుతాయి, అయస్కాంతము. | కాంతం, అయస్కాందమ్. | అయస్కాంత, సూజిగల్లు. |
| అంటువ్యాధి. | తొట్రునోయ్. | అంటురోగ. |
| అంటుసొంటు. అపవిత్రమగు. | తూాయ్మై అట్ర. | సోంకిన, అపవిత్రవాదదు. |
| అంట్రింత. వస్త్రమువలె తగులగానే పట్టుకొను గడ్డి, అంటి యుండుట, తగులాటము (అంటిస్స.) | తుణియై పిడిత్తుక్కొళ్ళు శిరు పిల్ కదిర్, విడాపిడి త్తల్; శెండై. | బట్టెగళన్ను గట్టియాగి హిడిదుకొళ్ళువ హుల్లు, జగళ. |

| తెలుగు | తమిళము | కన్నడము |
|---|---|---|
| అంట్లమైనము. | ఒట్టుమైనం, పిషిన్. | బంకె, అంటు. |
| అంట్లు. భోజన పదార్థములు వండిన పాత్రలు | పత్తు, శమయల్ శెయిద పాత్తిరంగళ్. | ముసురు. |
| అండ. సమీపము, దగ్గఱ, ఆశ్రయము. | అండై, కిట్ట, అరుగామై, శమీపం. | హత్తిర, ఆశ్రయ. |
| అండకోశము. వృషణము, ముష్కము, పుష్పములోని స్త్రీలింగ భాగము. | విదై, ముట్టైవడివమాన అండం. | బీజకోశ, తరడుబీజ. |
| అండగొట్టు. ఆలస్యముచేయు. | తామదంసెయ్. | విళంబమాడు, కాలహరణమాడు. |
| అండగొను. ఆశ్రయించు, ఆలస్యము చేయి. | ఆశరయిప్పదు, తామదంశెయ్, ఆదరవై అడయుదల్. | ఆశ్రయిసు అడచణెమాడు. |
| అండగోడ. అడ్డుగోడ, గోడకు బలముగా కట్టినగోడ. | ఒట్టుచ్చువర్. | వోటిగోడ, అండెగోడ. |
| అండగోళము. అండకణము. | ఉలగం, బీజం. | బీజకణ. |
| అండజము. కస్తూరి, చేప, పాము మొ. (గ్రుడ్డునుండి పుట్టినది,) | కస్తూరి, మీన్, పాంబుముదలియవై, ముట్టయిలిరుందు వెళివందనవై. | అండజ, మీను, కస్తూరి, హావు. |
| అండము. గ్రుడ్డు, వృషణము, ప్రపంచము. | ముట్టై, బీజం, ఆగాయం ఉలగం. | తత్తి, వృషణ ప్రపంచ. |
| అండర్ గ్రాడ్యుయేటు. (బి. ఏ. పట్టభద్రుడు కాబోవువాడు. | పట్టంవాంగువదర్కుమున్ మాణవన్. | పట్టభద్ర నాగువవను. |
| అండర్ సెక్రటరీ. ఉపకార్యదర్శి. | ఉదవి సెయలాళర్. | ఉపకార్యదర్శి. |
| అండా. రూ. అండి, అండీ, హండి, నీళ్లు కాచుపెద్ద పాత్ర, వెడల్పునోరు గల పెద్దపాత్ర. | అణ్డా, పెరియపాత్తిరం, కడాయి, వాయి అగండ పెరియపాత్తిరం. | అండె, హండె, కడాయ. |
| అండాశయము. స్త్రీబీజ కోశము. | ముట్టైయిల్ జ(శ)నిక్కుం ఉయిర్గళ్, యోని. | హెణ్ణిన బీజకోశ. |
| అండియ. చిమ్మనగ్రోవి, అండె. | తణ్ణీర్ తెళిక్కుకుం సిండకుళా. | కొళలు. |
| అండియము. రూ. అండె. అండెము. ఎద్దు లోనగునవి మోయు భారములో నొకభాగము. | సుమై, ఎరుదు మాడుగళ్ శుమక్కుం పండంగళిల్ ఒరు పగుది. | ఎత్తు, కదురె, కత్తె మంతాద జంతుగళ మేలేరుహాకిద భారద విభాగ, అండిగె. |
| అండోత్పత్తి. | అండత్తిన్ పిరప్పు. | అండోత్పత్తి. |
| అండ్రు. అందురు, చెప్పుదురు. | ఎన్బార్, కూఱువర్. | హేళువరు, అన్నువరు, |
| అండౌఘము. అండ (గ్రుడ్ల) సముదాయము. | ముట్టైగళిన్ సేగరిప్పు. | మొట్టెగళగుంపు, తత్తిగళగుంపు. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
| --- | --- | --- |
| అంతర్ధ, అంతర్ధి, మఱుగు. | మఱైదల్, మఱై వాగువదు. | గుట్టు, మఱెయాగు, |
| అంతర్ధానము. కనబడక పోవుట, మఱుగు అగుట. | మఱైందుపోదల్. | అదృశ్యవాగువుదు. |
| అంతస్సన్నిధి. మనస్సులో భగవంతుఁడున్నట్లు భావించుట. | మనదిల్ కళవుల్ ఇరుప్పదు పోల్ బావనై శెయిదల్. | అంతఃసాక్షాత్కారవాగువుదు. |
| అంతర్భూతము. లోపల నడగినది. | ఉళ్లేయే అడంగి ఇరుప్పదు. | ఒళగినదు, అంతర్భూత. |
| అంతర్యాగము. మానసపూజ. | ఆన్మికపూజై. | మానసపూజె. |
| అంతర్యామి. లోపలనుండునట్టిది, పరమాత్మ, జీవాత్మ. | ఉళ్లిరుక్కుమ్ జీవాత్మై, ఎంగుంఉళ్లవర్. | అంతర్యామి, జీవన, ఒళగిన [illegible] |
| అంతర్యుద్ధము. అంతఃకలహము. ఒక దేశస్థులు పరస్పరము పోరాడుట. | ఉళ్నాట్టుప్పోర్, కలగం. | తమ్మొళగిన యుద్ధ్యాదె. |
| అంతర్వత్ని. గర్భవతి. | కరువుట్రవళ్, గరుప్పవతి. | బసురుళ్లవళు, గర్భిణి. |
| అంతర్వాణి. శాస్త్రముల నెఱిగినవాఁడు, విద్వాంసుఁడు. | శాస్త్రం అరిందవన్, పులవన్. | శాస్త్ర, విద్వాంస. |
| అంతర్వాహిని. భూమిలోపల పారెడు నది. | బూమిక్కుళ్ ఓడుం నది. | భూమియొళగె హరియువ నది. |
| అంతర్వృద్ధి. శరీరము లోపల పైకి కనబడని పెరుగుదల. | ఉడలుక్కుళ్ వళర్చ్చి. | శరీరద ఒళగె వృద్ధి. |
| అంతర్హితము. కనబడకపోయినది. అంతర్ధానమైనది. | మఱైందుపోనదు. | అదృశ్యవాదదు. |
| అంతశయ్య. చావు, శ్మశానము, భూశయ్య. | సావు, శ్మశానం, భూశయ్యై, సుడుగాడు, మయానం, కల్లఱై. | సావు, శ్మశాన, భూశయ్యె, [illegible] |
| అంతలంతలు. అంతలేని. | అవ్వవ్వళవు. | అష్టు అష్టువడిగె. |
| అంతశ్ఛిద్రము. లోపలికలత. | ఉళ్ పత్తై. | ఒళగిన (కాణద) తప్పు. |
| అంతశ్శూన్యము. లోపలడొల్లగానుండునట్టిది. | ఉళ్ తొట్టిడం. | ఒళగె డొల్లాగిరువదు. |
| అంతస్తు. మిద్దె, పెద్దకట్టడములలోని పైపైమేడలు, కక్ష్య, మఱుఁగుచోటు, పరువు, తారతమ్యము. పదవి. | అంతస్తు, మాడి, మేల్ మాడి, వేట్రుమై, మరియాదై, వ్యత్యాసం, పదవి. | మాళిగె, అంతస్తుగళు, [illegible] హెచ్చుకడిమె, [illegible] |
| అంతా. అంతయు, అఖిలము, యావత్తు, బొత్తిగా. | ఎల్లాం, పూరా. | యావత్తూ, ఎల్లవూ. |
| అంతిక. ప్రాయ్య. | ఆడుప్పు. | వొలె, అందికె. |

| తెలుగు | తమిళము | కన్నడము |
|---|---|---|
| అంతికము. సమీపము, అంత్యంతికము, చాలదగ్గరిది. | అరుగామై, అణుగల్, మిగవుమ్ సమీపం, నెరింగియదు. | హత్తిరదదు, అవధి, కడి, బహళహత్తిరదదు, సమీపవాగు. |
| అంతికలు. అంతికెలు, కసవు తడికెలు దాపలు. | పైక్కోల్, దట్టి. | కస, తడికె, చాపె. |
| అంతిపురము. చూ. అంతఃపురము. | అరణ్మనై. | అరమనె. |
| అంతిమము. కడపటిది, చివరిది, సమీపించినది. | కడైసి, ముడివు నేరం. | కట్టకడెయల్లిరువుదు, అంత్యదదు, సమీపదల్లిరువుదు. |
| అంతియ. (అంతే). అంతె మాత్రము. | అవ్వళవే. | అష్టే. |
| అంతు. లెక్కలలోచివర, కూడిక మొత్తము, అంతేకము, ప్రారంభము, రహస్యము. (చూ. అంతుచిక్కలేదు, అంతుతేలలేదు). | మొత్తం, మొదల్, ఆరంబం, రగసియం, మూలం. | ఒట్టు, అంతు, ఆరంభ, కొనెయ, ఖేరీజు, రహస్య. |
| అంతేవాసి. శిష్యుఁడు, సమీపస్థుఁడు, మాలవాడు. | సీడన్, అరుగిల్ ఇరుప్పవన్, పఱయన్. | శిష్య, సమీపదవను, నామశూద్ర. |
| అంత్యజుఁడు. చండాలుఁడు కడపటి జాతివాఁడు. | కీళ్ జాదియినన్. | చండాలను, చండాల, కొనెయకులస్తను. |
| అంత్యము. కడపటిది, అధమము. | కడైసియదు. | కట్టకడె ఇరువుదు, అంత్య, అధమ. |
| అంత్రము. (రూ. ఆంత్రము) ప్రేగు. | కుడర్, కుడల్ (అందిరికం.) | ఆంత్ర, కరుళు. |
| అంద. (అందే) అక్కడనే. | అంగేయే. | అల్లియే. |
| అందకత్తె. (అందకత్తియ) అందగత్తె. సౌందర్యవతి, రూపసి, చక్కనిది. | అళగి, నల్లఅళగియ ఉరువముళ్లవళ్. నల్లదు. | అందగార్తి, చెలువాదవళు. |
| అందంద. అక్కడక్కడ, మఱి. | అంగాంగే. | అల్లల్లి, [illegible]. |
| అందగించు. రమ్యమగు. చక్కగానుండు. | అళగాగ ఇరుప్పదు. | రమ్యవాగు, సొగసాగు. |
| అందజేయు. చేరునట్లుచేయు. | శేరుబండి శెయ్దల్. | సేరిసు, అందిసు. |
| అందదుకు. మిక్కిలి అతుకులు కలది, చేరికలేనిది. పూర్తికానిది. | నిఱైయ ఒట్టుగళ్ ఉళ్లదు, కలప్పడమట్టదు, నిఱైవుకాణాదదు. | తుంబా అదుక ఇరువుదు, సేరద ఇరువుదు, అసంపూర్ణవాదదు. |
| అందనుక. అంత దనుక, అందాక, అంతవఱకు. | అదువరై. | అష్టుదనక. |
| అందపడు. రమ్యమగు. | అళగా ఇరుప్పదు, | అందవాగు. |
| అందచందములు, సౌందర్యము, ఉండు విధము. | సుందరమాగ ఇరుత్తల్, ఇరుక్కుం విదం, అళగు, అళగుం భావనయుం. | సుందరవాగి ఇరువదు, సౌందర్యవూ స్వభావవూ. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
|---|---|---|
| అందము. సౌందర్యము, సొగసు, విధము. | అళగు, వణ్ణం, ఎళిల్. | సొగసు, చెలువు, బగె, అంద. |
| అందఱు. ఆఁదోఱు, ఎల్లవారు. | ఎల్లోరుం. | ఎల్లరు. |
| అందలము. ఆందోళిక, పల్లకి. | పల్లక్కు. | అందళ, మేనా. |
| అందలి. అచ్చటనుండు నట్టి. | అంగేయిరుక్కుం, అంగుళ్ల. (అంగేఉళ్ల) | అల్లిరువ. |
| అందవికారము. అందహీనము, కురూపము. | విగారం, అళగిల్లామై. | దురుళతన, కురూప, అందగాడి. |
| అందాక. అంతవఱకు. | అదువరైయిల్. | అష్టుదనక. |
| అందిక. సమీపము. | సమీపత్తిల్. | సమీప. |
| అందికొను. అందుకొనుట. | ఎట్టిక్కొళ్, పిడిత్తుక్కొళ్. | హిడికొళ్ళ్, సేరు, అందు. |
| అందికోలు. చేరువ, అందుకొనుట. | కిట్టత్తిల్, అరుగిల్, పిడత్తుక్కొళ్. | సేరు - సమీప. |
| అందిపొందినవాఁడు. దూరపు చుట్టము. | దూరత్తు ఉఱవినన్. | దూరదబంధు. |
| అందియ. (అందె) ఆడువాండ్రు కాళ్లకు ధరించెడు నగ. | సిలంబు, కాలణి. | అందుగె, కాలుబళె, కాలుంగుర. |
| అందు. దానిలో, ఆచోట, గ్రహించు, పొందు. | అదనుళ్, అఙ్గైందు ఎడుత్తుక్కొళ్. | ఆనెయకారిగె, బంధన, ఒందువృక్ష విశేష. |
| అందుకొను. కైకొను, చేయిచాచి పుచ్చుకొను. | వాంగిక్కొళ్, ఎడుత్తుక్కొళ్, కైనీట్టి వాంగుదల్. | కైచాచి స్వీకరిసు. |
| అందుకోలు. అందుకొనుట అతిసమీపము, అందుపాటు. | పిడిత్తుక్కొళ్లు, మిగఅరుగిల్, కైనీట్టి ఎడుక్కుం అదిల్. | సేరువుదు, అత్యంత సమీపవాద, సేరతక్కదు. |
| అందుగు. చిల్లచెట్టు (రూ. అందువు). | ఒరువిదమానమరం. | నిర్మోలిగిడ. |
| అందుబడి. ప్రాప్తము, సమీపము. | సమీబమ్, ఏట్రబడి, ఒదవు. | ప్రాప్త, సమీప. |
| అందుబాటు. ఉపయోగపడు. | ఎట్టినమాదిరి, కిడైక్కుంబడి. | ప్రాప్త. |
| అందులకు. దానికి, ఆచోటికి, ఆపనికి. | అదర్కు. | అదక్కె, అదక్కోసర, ఆకెలసక్కె. |
| అందె. అందియ. | సిలంబు. | నూపుర, మంజీర. |
| అందెబందెలు. చిక్కులు. | తడైగళ్. | తడైగళు, తొందరె, కష్టగళు. |
| అంధకము. గ్రుడ్డి, ఆయుధము. | కురుడు, ఒరు ఆయుదం. | కురుడు, ఒందు ఆయుధ. |
| అంధకారము. చీకటి, ఇరులు. | ఇరుళ్, కరుప్పునిరమ్. | కత్తలె, ఇరుళు. |
| అంధకుడు. గ్రుడ్డివాడు, ఒక రాక్షసుడు. | కురుడన్, ఒరు అరక్కన్. | కురుడ, అంధకాసుర. |
| అంధకురాలు. గ్రుడ్డిది. | కురుడి. | కురుడి. |
| అంధకూపము. పాడునూయి. | పాళుంగిణర్. | హాళుభావి. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
| --- | --- | --- |
| అంధతమసము. గాఢాంధకారము, కటికి చీకటి. | కారిరుళ్. | గాఢాంధకార. |
| అంధము. చీకటి, గ్రుడ్డిది, (అంధిక.) | ఇరుళ్, కురుడి. | కత్తలె, కురుడి. |
| అంధస్సు, అన్నము. | శాదం, వ్యంజనం. | అన్న, కూళు. |
| అంధిక. (చూ. పై.) | కురుడి. | కురుడి. |
| అంధుఁడు. (చూ. అంధకుఁడు.) | అంగదన్, కురుడన్. | అంధ. |
| అంధువు. నూయి. | కిణఱు. | భావి. |
| అంధ్రము. తెలుగు (ఆంధ్ర) దేశము. | తెలుంగు, తెలుంగు నాఁడు. | తెలుగునాడు. |
| అంధ్రుడు. కిరాతుడు. | కిరాతకన్. | కిరాత, బేటెగార. |
| అంప. బాణము. | అంబు. | బాణ, అంబు. |
| అంపకట్టె. బాణము. | అంబిఱ్కోళ్. | బాణ, అంబినకోలు. |
| అంపకము. / అంపకములు } అంపుట. బంధు మర్యాదలతో పంపుట. సెలవొసంగుట, ప్రేషణము. | ఎళుచ్చి, ఉత్తరవు. | హిసు, రజెకొడు, ఒప్పిసు. |
| అంపకాడు. విలుకాడు, గుఱితప్పని వాడు. | విల్లుక్కారన్ - అంబు ఎయ్‌వదిల్ గుఱితవరాదవన్. | బిల్లుకార, గురితప్పదవను, ధనుర్భాణి. |
| అంపకోల. బాణము. | అంబు. | బాణ, అంబు, |
| అంపగరి(ఱి). బాణమునకు గట్టిన యీకలు. | బాణంగళుక్కు కట్టియ ఇరగుగళ్. | బాణదగరి, అంబుగరి. |
| అంపఱ. బాణసమూహము. | బాణంగళిన్ మొత్తం. | బాణ సమూహ. |
| అంపఱచిచ్చు. బాణాగ్ని. | బాణత్తిఱ్ నెరుప్పు. | బాణద ఉరి. |
| అంపాచారము. జలప్రవాహము. | తణ్ణీర్ వెళ్లం | జలప్రవాహ, హొనలు. |
| అంపించు. పంపించు, అంపు. | అనుప్పు, పోగఉత్తరవుకొడు. | కళుహిసు, అంపక. |
| అంపియ. (అంపె) చింపిగుడ్డ. | కిళిందతుణి. | చింది (బట్టె.) |
| అంపు. రూ అనుపు, పంపు, పంపించు, ఆజ్ఞాపించు, జాతర. | అనుప్పు, అనుప్పుదల్, ఆజ్ఞైయిడల్ కట్టలై పిరప్పిత్తల్, తిరునాళ్ చెల్వదు. | కళుహిసు, ఆజ్ఞాపిసు, కరసె, జాత్రె. |
| అంపుదోడు. ప్రయాణికునితోడు. | తోళిపిరయాణిగఱ్, తుణైవరుబవఱ్. | ప్రయాణదగెళెయ, తొణెగె ఇరువను. |
| అంపె. (చూ. పైన) | | |
| అంబ. అమ్మ, పార్వతి. | అమ్మా, ఉమై. | అవ్వ, అమ్మ, అంబికె. |
| అంబకము. కన్ను, బాణము, (త్ర్యంబకుడు. ముక్కంటి, శివుడు.) | కణ్, అంబు. ముక్కణ్ణఱ్ (పరమశివన్.) | కణ్ణు, అంబు. (ముక్కణ్ణప్ప.) |

| తెలుగు | తమిళము | కన్నడము |
| --- | --- | --- |
| అంబకళము. (చూ. అంబలి) | కంజి. | అంబలి. |
| అంబరము. ఆకాశము, వస్త్రము, పరిమళద్రవ్యము. | ఆగాయమ్, తుణి, పరిమగళ దిరవియంగళ్. | ఆకాశ, వస్త్ర, పరిమళ ద్రవ్య. |
| అంబరు. ఒకవిధ పరిమళ ద్రవ్యము. | అంబర్, వాసనైయుళ్లదు. | ఒందు పరిమళద్రవ్య, అత్తరు. |
| అంబలము. కలకలధ్వని. | అంబలమ్, ఒన్రుమిల్లామై, శిట్రంబలమ్. | కలకలధ్వని. |
| అంబలి. ఒకవిధమైన త్రాగు జావ. | కంజి. | అంబలి, అంబకళ. |
| అంబష్ట. అడవిమొల్ల, పులిచింత. | ఒరువగై శెడి. | పుళ్ళంబలి, అంబటి. |
| అంబష్ఠుడు. మంగలి. | అంబట్టన్. | అంబట. |
| అంబస్తు. నిష్కపటి, అమాయికుడు. | కవుడట్రవన్, వెగుళి. | సరళస్వభావదవను, అమాయిక. |
| అంబారము. ధాన్యరాశి. | అంబారం, దానియంగళిన్ మొత్తం. | కాళిన ఖప్పె. |
| అంబారి. ఏనుగుమీది ఆసనము. | యానైమేల్ ఇరుక్కుం ఆసనం. | అంబారి, హౌడా. |
| అంబారుపిడుజు. పశువుల దేహమున నంటుకొని యుండి రక్తము పీల్చెడి పురుగు. | మాట్టిన్మేలుట్కారుందు రత్తత్తై ఉరియుం ఒరువగై ఈ, ఉణ్ణి. | ఆకళరక్త కుడియువనుసిహుళ, ఉణుగు. |
| అంబాళము. ఆమ్రాతకము, నల్లమామిడి. | తిత్తిమరం, (అంబల విరుక్కం,) | ఆమ్రాతక, కరిమావినగిడ. |
| అంబు. బాణము, అమ్ము. | అంబు, బాణం. | బాణ. |
| అంబుకణము. తుంపుర. | నీర్తుళి. | సీకర, తుంతురహని. |
| అంబుజము. తామర, గన్నేరుచెట్టు. | తామరై. | తావరి, గన్నేరదగిడ. |
| అంబుదము. మేఘము, | మేగం. | మేఘ. |
| అంబుధి. సముద్రము. | కడల్. | సముద్ర, సంద్ర. |
| అంబుప్రసాదము. చిల్లగింజ. | తేతాంగొట్టై. | |
| అంబుప్రసాదనము. కుంకుడుకాయ. | సోప్పుకాయ్. | అంబుప్రసాద. |
| అంబుభృత్తు, మేఘము. | మేగం. | మేఘ. |
| అంబుమర్కటము. ఒడక మొసలి. | ఒరువగై తణ్ణీర్ మొదలై. | నుగిన! మొసళె. |
| అంబురాశి. సముద్రము. | కడల్. | సముద్ర. |
| అంబులపొది. తూణీరము. | తూణీరమ్. | తూణికె, బాణదబత్తళికె. |
| అంబువాహిని, నీళ్లు పోవుతూము, దోనె. | దోని, తణ్ణీర్వడియుం కుళా. | జలదారి, తూము, దోనె, |
| అంబువు. ఉదకము. | తణ్ణీర్. | నీరు. |
| అంబుస్ఫోటము. నీటిబుగ్గ. | తణ్ణీర్ ఊత్తు. | నీరుబుగ్గె, బొబ్బళ. |
| అంబూకృతము. తుంపర గలది. | తణ్ణీర్ తొళైగళ్ ఉళ్లదు. | తుంతురెవుళ. |
| అంబే. (సం. అంభ) ఆవుల దూడల కూత. | మాట్టిన్ కూవల్. | అంబా ఎన్ను. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
| --- | --- | --- |
| అంబేద. దిట్టతనము లేనివాడు. మెత్తనివాడు, అప్రయోజకుడు. | కైయా లాగాదవన్, మగవుం నల్లవన్, ఉపయోగమట్రవన్. | అప్రయోజక, గట్టిగారనాగదే ఇరువను. |
| అంభస్సు. నీరు. | తణ్ణీర్. | నీరు. |
| అంభారావము. ఆబోతుయొక్క అఱపు. | కడామాట్టిన్ కూవల్. | గూళియ కూగురంక. |
| అంభోజము. కమలము. | తామరైమలర్. | కమలె. |
| అంభోజిని. తామరతీగ, తామరకొలను, పద్మసమూహము. | తామరైకొడి, తామరైక్కుళం. | తామరబళ్లి, పద్మసరోవర. |
| అంభోదము. మేఘము. | మేగం. | మేఘ. |
| అంభోధి. (అంభోనిధి, అంభోరాశి) సముద్రము. | శముద్దిరం. | సముద్ర. |
| అంభోరుహము. పద్మము. | పద్మం. | తావరె. |
| అంశ. డిగ్రీ, కోణము యొక్క పరిమాణము, పాలు, వంతు, విషయము. | అశం (డిగ్రీ) కోణం, బాగం. | కోణ, డిగ్రీ, భాగ, విషయ, పాలు. |
| అంశభాగము. అదృష్టము. | అదృష్టం. | అదృష్ట, విధి. |
| అంశకుఁడు. పాలికాపు. | పంగుకొళ్లుం ఉళవన్. | పాలిగెమాడువ రైత, జీతద ఆళు, |
| అంశపురుషుడు. అదృష్టవంతుఁడు. | అదృష్టవాన్, భాగ్యవాన్. | అదృష్టవంత. |
| అంశము. చూ. అంశ. | అంశం, బాగం | అంశ, భాగ, |
| అంశయిత. భాగించువాఁడు. | పంగుపోడుపవన్. | భాగమాడువను, భాగ ఇట్టుకొడువను. |
| అంశుకము. ఉత్తరీయము, వస్త్రము, సన్నవస్త్రము. | మేల్ తుండు, మెల్లియతుణి. | ఉత్తరీయ, సణ్ణబట్టె. |
| అంశుమంతుఁడు. సూర్యుఁడు, ధనవంతుఁడు. | సూరియన్, పణక్కారన్. | సూర్య, శ్రీమంత. |
| అంశుమతి. ముయ్యాకుపొన్న. | మూన్రుఇలైయుడైయ పొన్నమరం. | మూరాకుపొన్న. |
| అంశుమత్ఫలము. అరటి చెట్టు. | వాళైమరం. | బాళెగిడ. |
| అంశుమాలి. సూర్యుఁడు. | సూరియన్. | సూర్య. |
| అంశువు. కాంతి, కిరణము. | కిరణంగళ్, ఒళి. | కాంతి, కిరణ. |
| అంసకూటము. ఎద్దుమూపురము. | ఎరుదిన్ మూపురం. | ఎత్తినడుబ్బ, మూపుర. |
| అంసము. మూపు, భుజశిరము. | ఎరుదిన్ కళుత్తిన్ మేల్ పురం, | ఎత్తదభుజ, భుజద శిఖర. |
| అంసలుఁడు. బలిసినవాడు. మంచిమూపుగలవాడు, బలవంతుఁడు. | కొళుత్తవన్, బలవాన్. | ఒళ్లెయ ఎత్తాదభుజగళుళ్లవను బలవంత. |
| అంహతి. ఈవి, తెగులు, విడుపురోగము. | దానమ్ తరుమ్గుణం, నోయ్. | దాన, త్యాగ, వ్యాధి, |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
|---|---|---|
| అంహస్సు, పాపము. | పాపమ్. | పాప. |
| అట. (అంట) వృత్తాంతమును మహత్వమును తెలుపుట. చూ. అంట. | ఉరైయాడల్గళిల్ వరుమ్ ఒరుచొల్. అప్పడియామ్. | మహత్వవాచక యావదాదరు వృత్తాంత సూచక. |
| అక. అక్క, పూజ్యస్త్రీ. | అక్కా, తమక్కై, సగోదరి. | పూజ్యస్త్రీ, అక్క. |
| అకట, అకటా సంతాపసూచకము. అయ్యో, అక్కటా, కటా, కట్టా. | అక్కడా, అయ్యో. | అయ్యో, సంతపసూచక. |
| అకటవికటము. అకటావికటము | అకటవికడం, ఏడాగోడం, | ప్రతికూల, వికట. |
| అకము. దుఃఖము, పాపము. | దుఃఖం, పావం. | సంకట, పాప, కష్ట. |
| అకరణి. శాపము, తిట్టు. | శాబం, తిట్టు. | శాపము, బైయువుదు. |
| అకరణీయము. చేయఁదగనిది. | శెయ్య తగాద వేలై. | మాడకూడదద్దు. |
| అకరము. పన్నులులేనిది. | వరిఇల్లాదదు. | తెరిగెఇల్లదద్దు |
| అకరికుడు. సుంకరి. | వరివసూలిప్పవన్. | తెరిగె (సుంక) వసూలుమాడువవను. |
| అకరు, అకరువు తామర పువ్వులలోని పుప్పొడి కింజల్కము. | తామరై పుప్పత్తిల్, ఉళ్ళపొడి. | తావరె, పుష్పధూళి. |
| అకరుఁడు. చేయలేనివాఁడు, పన్ను చెల్లింపనక్కఱ లేనివాఁడు. | శెయ్యముడియాదవన్, వరికొడుక్క అక్కఱై యిల్లాదవన్. | కెలసబల్లదవను, సుంకబిడుగడె ఆదవను. |
| అకస్మాత్తు. ఉన్నట్లుండి, తటాలున, హఠాత్తుగా. | దిడీరెన్రు. | అకస్మాత్తాగి. |
| అకళంకము. నిష్కళంకము, దోషము లేనిది. | దోషమట్రదు, కళంగమట్రదు. | దోషవిల్లాదదు. |
| అకల్పితము, సహజము, కృతిమము కానిది, చూ. అకృత్రిమము. | కర్పనైయల్లాదదు, ఇయర్కైయానదు. | సహజవాదదు, కల్పితవల్ల. |
| అకాండము. అకస్మాత్తు. | అకాండం, దిడీర్. | అకస్మాత్తాద. |
| అకారణము. కారణము లేనిది. | కారణమట్ర. | కారణంవిల్లద, |
| అకాలము. సరికాని కాలము, అసమయము. | అకాలం, వేళైయట్ర. | అవేళద హొత్తు, అసమయ. |
| అకించనుడు. దరిద్రుడు. | దరిద్దిరన్. | దరిద్ర, బడవను. |
| అకిల్బిషము. నిర్దుష్టము, పాపరహితము. | పావకరైయట్రదు, సుత్తమానదు. | పాపరహిత, నిర్దుష్ట. |
| అకుంఠితము. నిరాతంకమైనది, మొక్కపోనిది, తగ్గనిది, | ఎదిరిల్లాదదు, అడిపడాదదు, కురైవు ఇల్లాదదు, | అడ్డిఇల్లద, క్షీణతె ఇల్లదద్దు. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
|---|---|---|
| అకుతోభయుఁడు. దేనికి భయపడనివాఁడు. | ఎదర్కుం భయపడాదవన్. | ఎల్లాదరూ బయబిళదవను, నిర్భీక. |
| అకూపారము. సముద్రము. | సముత్తిరమ్. | సముద్ర. |
| అకృతకము. స్వభావసిద్ధమైనది. | ఇయర్కై. | అకృతక. |
| అకృతజ్ఞత. మేలుమఱచుట. | శెయ్‌న్నన్రిమఱప్పదు. | కృతఘ్నతె. |
| అకృష్ణకర్ముఁడు. సత్ప్రవర్తనము గలవాఁడు. | నల్ల నడవడిక్కైయుళ్లవన్. | నిర్దోషి, సజ్జన. |
| అకో! సంశయార్థము. | సందేగత్తుక్కురియచ్చొల్. | సంశయార్థక. |
| అక్క. (చూ. అక) ఔర. (చూ. అమ్మక చెల్ల.) | ఆచ్చరియచ్చొల్. | భలా! హేదే, హహాదో. |
| అక్కజము. ఆశ్చర్యము. | ఆచ్చరియం. | ఆశ్చర్య. |
| అక్కజుఁడు. అధికుఁడు. | అదిక్యం ఉళ్లవన్. | దొడ్డవను, అధిక్యతె వుళ్లవను. |
| అక్కజురాలు. అధికురాలు. | అదిక్యం ఉళ్ల పెణ్‌మగళ్. | అధిక్యతె ఉళ్లవళు. |
| అక్కట. చూ. అకట. | అయచ్చొల్. | అయ్యో. |
| అక్కటిక. అక్కటికము, కనికరము. | దయవు, కనికరం, అన్బు. | కనికర, దయె. |
| అక్కడ. అ+కడ, ఆచోట. | కడై (=చోటు) ఇడమ్, అవ్విడమ్. | అల్లి. |
| అక్కరము, అక్షరము. | ఎళుత్తు, అళియాదదు. | అక్షర, శాశ్వత. |
| అక్కఱ. అపేక్ష, ప్రయోజనము, శ్రద్ధ, ఆవశ్యక కార్యము. | అక్కఱై, అవశియం, పిరయోజనం, శ్రద్దై. | అపేక్షె, ప్రయోజన, శ్రద్ధె. |
| అక్కఱకాఁడు. అక్కఱగలవాఁడు. | అక్కఱైయుండానవన్. | ఆవశ్యకకార్య, అక్కఱై ఉళ్లవను. |
| అక్కఱపడు. పనివడు. | వేలైతడైయ. | కెలసబిళు (ఇరు). |
| అక్కఱపాటు. ఆసక్తి. | పట్టు, ఆశై, సంబందం. | అపేక్షె, ఆశె, |
| అక్కలకర. జ్వరహారియైన మూలిక. | అక్కలకర - తెలుంగుపెయర్ - జ్వరత్తిర్కాగ తరుమ్ ఒరుమరుందు. | జ్వరక్కె ఒందు ఔషధి. |
| అక్కలవాడ. వంటలక్కలుండు వీథి. | శమయల్ శెయ్యుం పెండిర్‌గళ్ వసిక్కుం తెరువు. | అడిగెయవరు ఇరువబీది. |
| అక్కలి. అల. | అలై. | అలె. |
| అక్కలిపడు. దిగ్భ్రమపడు. | బ్రమై, కలక్కం, పైత్తియం. | బెప్పారు. |
| అక్కలించి. (అక్కలించు) కడుపు వెన్నునకు అంటుకొనునట్లు స్రగ్గించు. | ఒట్టికొళ్లుదల్. | హొట్టెయన్ను బెన్నిగె అంటిసి తగ్గిసు. |
| అక్కసము. దయ, సంతాపము. | దయవు, పరిదాపమ్. | కరుణె, సంతాప. |
| అక్కసి. ఆగ్రహపూరితుఁడు (అక్కసుకాఁడు, కోపి.) | కోబంకొండవన్. | ఆగ్రహ ఉళ్లవను, అక్కసువుళ్లవ. |

| తెలుగు | తమిళము | కన్నడము |
| --- | --- | --- |
| అక్కసు. కోపము. | కోపం, ఆగ్రహం. | కోప, ఆగ్రహ. |
| అక్కి. బిడ్డలకువచ్చు ఒక రకపు గజ్జి. | అక్కికణ్ణు, అక్కిని కరప్పాన్, ఉష్ణం. | మక్కళిగె బరువ గజ్జి. |
| అక్కిబిక్కిదండ. పిల్లల ఆటలలో నొకటి. | కుళందైగళిన్ విళైయాట్టుగళిల్ ఒన్రు. | ఒందు తరహ ఆట. |
| అక్కలి. కలత. | కలక్కం. | వ్యాకుల తె. |
| అక్కిలిపడు. | సంకటపడు, కష్టపడు. | సంకటబిళువ. |
| అక్కు. బొమ్మ. | మార్బు. | ఎదె. |
| అక్కుపక్షి. బుద్ధిహీనుడు. | కరుడన్, కురుడన్, ముట్టాళ్. | మూర్ఖ, బుద్ధిల్ల దవను. |
| అక్కుళ్లు. ధాన్యభేదము అట్టగడలు. | అక్కుళ్, కక్కుమ్. | అక్కియ దినుసు. |
| అక్తము. చేరినది, పోయినది స్పష్ట మైనది. | అట్ చద్దై, పంగుప్పడాదదు. | సేరిదదు, స్పష్టవాదుదు. |
| అక్రమము. క్రమముకానిది, నేరము, తప్పు, దుర్మార్గము, అన్యాయము. | అక్కిరమమ్, కొడుమై, తవరు, ఒళుంగిన్మై, అనియాయమ్. | క్రమవిల్లదద్దు, తప్పు, అన్యాయ. |
| అక్రోధనుడు. కోపము లేనివాడు. | అక్రోదనన్, కోవమట్రవన్. | కోపవిల్లాదవను. |
| అక్షతము. దెబ్బతగులనిది, విఱుగనిది, పూర్తివస్తువు. | అక్షతై, విరియాదరు, ముళువానదు. | గాయవిల్లద, మురియదె ఇరువ, పూర్తి వస్తువు. |
| అక్షతలు. పసుపుకుంకుమ పూసిన విఱుగని బియ్యము (మంగళకరమైన). ఆశీర్వదించుట కుపయోగించునది. | అక్షదై, మంగళకరమాన అరిశి. | మంగళాక్షతె, అక్షతె.ఆశీర్వాద మాడువవరు చల్లువ హారిషిణహచ్చిద అక్కికాళు. |
| అక్షత శరీరుడు. తానుదెబ్బతినక యుద్ధమొనర్చిన వీరుడు. | ఒడలిల్ గాయంపడామల్ పోరాడియ వీరన్. | గాయగళ్లు ఇల్లదె పోరిద యుద్ధవీర (బంటు.) |
| అక్షదర్శకుడు. న్యాయవిచారణకర్త. | నియాయ విచారణై శెయ్‌బవన్. | న్యాయ విచారణె మాడువవను. |
| అక్షదేవి. జూదమాడువాడు. | కూదాడుగిరవన్. | జూజాటవాడు కితవ. |
| అక్షద్యూతికము. జూదమునందలి కలహము. | కూదాట్టతిల్ శండై. | జూజాటదొళిగిన జగళ. |
| అక్షధూర్తిలము. ఎద్దు. | ఎరుదు. | ఎత్తు. |
| అక్షధూర్తుడు. జూదరి. | కూదాట్టి. | రొక్కదాటగార. |
| అక్షమాల. జపమాల. | అక్షమాలై, ఉరుద్రాక్షై. | జపమాలె. |
| అక్షము. పాచిక, బండికన్ను ఇంద్రియము, కన్ను, గణించుటకు వీలైన ఒక సిరరేఖ. | ఉరుత్తిరాక్షై, కణ్, పగడక్కాయ్, ఒరురేగై. | దాళ, నెత్తపగడె, కణ్ణు, అక్షరేఖె అచ్చు. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
|---|---|---|
| అక్షయపాత్ర, భిక్షాపాత్ర, ముష్టి. | పిచ్చై ఎడుప్పదర్కు ఉడైయ ఏనం. | భిక్షాపాత్రె, తిరుపె. |
| అక్షయము. నాశము కానిది. | అళివు ఇల్లాదదు. | నాశవిల్లదదు. |
| అక్షరజ్ఞుడు. విద్వాంసుడు. | విద్వాన్. | విద్వాంస. |
| అక్షరము. అక్కరము, పరబ్రహ్మము. ముక్తి, నాశము లేనిది. | ఎళుత్తు, కడవుళ్, మోక్షం అళివు ఇల్లాదదు. | అక్షర, బరహ, పరమాత్మ, మోక్ష, నాశవిల్లదదు. |
| అక్షరాభ్యాసము. విద్యాభ్యాసము. | ఎళుత్తుక్కొల్లి తరువదు, విద్యాబియాసం. | విద్యాభ్యాస, అక్షరాభ్యాస. |
| అక్షరుఁడు. చెడనివాఁడు, విష్ణువు. | కెడాదవన్, పెరుమాళ్. | అక్షర, బ్రహ్మ, మహావిష్ణువు. |
| అక్షవతి. జూదము. | శూదాట్టం. | జూజాట. |
| అక్షవాటము. జెట్టీలు. సాధకము చేయుచోటు. | మల్లశాలై. | మల్లశాలె. |
| అక్షవిద్య. జూదము. | శూదాట్టం. | జూజాటద కలె. |
| అక్షశౌండుడు. జూదమునందు నేర్పరి. | శూదాట్టత్తిల్ వల్లన్. | జూజాటదల్లి చతుర. |
| అక్షసరము. జపమాలిక. | జపమాలై. | జపమాలె. |
| అక్షసూత్రము. జపమాలిక, | జపమాలై. | జపమాలె. |
| అక్షి. కన్ను. | (అక్కి) కణ్. | కణ్ణు. |
| అక్షింతలు. అక్షతలు. | అక్షదై, మంగళఅరిశి. | అక్షతె. |
| అక్షిగతుఁడు. పగఁగొనఁదగినవాఁడు. | పగైక్కు తగుదియానవన్. | హగెతీరిసికొళ్ళుదక్కె సరియాదవను. |
| అక్షిపక్ష్మ. ఱెప్ప వెండ్రుకలు. | కణ్ ఇమై. | ఱెప్పెయ రోమగళు, హుబ్బినకూదలు. |
| అక్షీబము. మునగచెట్టు. | మురుంగై మరమ్. | అక్షీబ, నుగ్గెగిడ. |
| అక్షీణము. ఎడతెగనిది, తఱుగనిది. | కురైవిల్లాదదు, ఇడైపిరియాదదు. | క్షీణవాదదు అక్షయ. |
| అక్షీబము, మునగచెట్టు, పండింపఁగలుగు ఉప్పు. | మురుంగమరమ్. మరంగళుక్కు ఎరువాగ పోడుం (ఉరం) ఉప్పు. | నుగ్గెమర. సముద్ర ఉప్పు. |
| అక్షుద్రతరము. చాల పెద్దది. | మిగవుం పెరియదు. | బహళ దొడ్డదు. |
| అక్షోటము. కొండగోగు. | మలైగళిల్ పైరాగుం 'గోంగూరా'. | మలెయ పల్లె పుంటి గోగిసొప్పు. |
| అక్షోభము, కలతలేమి, ఏనుఁగునుకట్టు కంబము. | కలక్కం ఇల్లాదదు. యానైయైక్కట్టుం కంబమ్. | ఆనెయన్ను కట్టుకకంభ. |
| అఖండము. సమస్తము, ఖండము కానిది, అఖండదీపము, నిరంతరము వెలుగుచుండెడి దీపము. | అగండం. అభిన్నం, ఎల్లాం, ఎప్పొళుదుం ఎరియుం దీపం, నందావిళక్కు మణివిళక్కు అణైయాద దీపం. | సంపూర్ణ, అభిన్న, అఖండదీప, నందాదీప, యావల్లు ఆరద ఇట్టదీప. |
| అఖండిత. ఖండింపఁబడని, అనశ్వరమైన. | అఖండం, ముళుమై. అళివల్లదు. | వినాశవిల్లద, శాశ్వతవాద. |
| అఖండుకము. పొట్టి టెంకాయచెట్టు. | కట్టై తెన్నమరం, ఉయరం కళరాద తెన్నైమరం. | కుళ్ళ తెంగిన గిడ. |

| తెలుఁగు | తమిళము | కన్నడము |
|---|---|---|
| అఖర్వము. విస్తారము. | అదిగమానదు. | విస్తారవాదదు. |
| అఖాతము. మనుష్యులచేత త్రవ్వఁబడని కోనేరు మొదలగు నీటిగుంటకి. | అగాధం, ఆళం, బొందు, సీందుం పుణల్, వంచకం. | దైవనిర్మిత, సరోవర, అఖాత. |
| అఖిలము. సమస్తము. | ముళు, ఎల్లాం, బూమి. | సమస్త. |
| అఖిలాండము. భూమి. | అగిలాండమ్, ఎల్లాం, బూమి ఆగాయం మట్రుం. | అఖిలాండ. |
| అగచరము. కోఁతి. | కురంగు. | కోఁతి, మంగ. |
| అగచాట్లపోఁతు. అనేక ఆపదలను పొందినవాఁడు, | అనేక కష్టంగళై అనుబవిత్తవన్. | బహుకష్టగళు పట్టవను. |
| అగచాట్లు. ఆపద, కడగండ్లు, తిప్పలు. | ఆబత్తు, కష్టం, తున్బం. | ఆపదె, కష్ట. |
| అగడిత. కోటచుట్టు త్రవ్వబడిన జలాధారము. | అగళి, కోట్టైచుట్రుం కూళుంద తణ్ణీర్. | అగళ్తె, పరిఖ. |
| అగడు. నింద, రవ్వ, అపకీర్తి, అల్లరి. | పొల్లాప్పు, నడు, వయిరు, నింద్దై, కెట్ట ప్పెయర్. | నిందె, రట్టు, అపనిందె. |
| అగడుపడు. దూఱుపడు. | నింద్దైపడు. | నిందెపాలాగు. |
| అగడుపఱచు, నిందించు. | నింద్దైపడుత్తు, పళిశుమత్తు. | నిందిసు. |
| అగడ్త. అగడిత, పరిఖ. | అగళి. | అగత్తె, పరిఖ. |
| అగణ్యము. ఎంచఁదగనిది. ఎక్కువ. | ఎణ్ణిక్కైక్కు అప్పాల్ పట్టదు. | ఎణికెయోగ్యతె ఇల్లదదు. |
| అగణితము. విస్తారమైనది. | అధికమానదు, | విస్తారవాదుదు |
| అగత్యము. అవశ్యము, అవశ్యకత. | అగత్యము, అవశియం,అవశరం, ముఖ్యం. | అగత్య. |
| అగదంకారుడు. వైద్యుఁడు, | వైత్తియన్. | వైద్య. |
| అగదము. మందు. | మరుందు. | మద్దు, ఔషధి. |
| అగప. కొంకాయచిప్ప, గరిటె, అబక. | అగప్పై, చట్టువం. | తెంగిన కవటె, కరట. సౌటు. |
| అగపడు. కనఁబడు, దొరకు, చిక్కు, అధీనమగు, | అహప్పడు, వశప్పడు, చిక్కికొళ్ళు. | కాణిసు, సిగ్గు అధీనవాగు. |
| అగపఱచు. చూపించు. | కాన్బిత్తల్. | తోరిసు. |
| అగపాటు. అగపడుట. | కాణప్పట్టదు. | కాణిసు. |
| అగమము. కొండచెట్టు, పాము. | మలై మరం, పాంబు. మలై, మరమ్. | బెట్టదగిడ, హావు. |
| అగము. కొండ, చెట్టు, పాము. | పాంబు, మలై, మరమ్. | బెట్ట, గిడ, హావు. |
| అగమ్యము, పోవ శక్యముకానిది. | పోగముడియాదదు, అఱియక్కూడాదదు. | హోగలు సాధ్య విల్లదదు. |
| అగమ్యాగమనము, చొరనివ్వనిది. | పుగ ముడియాదదు. | హోగ బారదదు. అరియలారదదు. |

